# చౌగర్ పులులు

గ్రంథకర్త :

జిమ్ కార్బెట్

Jim Corbet

అనువాదకుడు :

కృత్తివాస తీర్థులు

Krithivasa Thirtuen

చిత్రకారుడు :

సి. హెచ్. జి. మూర్‌హౌస్

C. H. G. Morcus.





ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్

బొంబాయి కలకత్తా మద్రాస్

1956

# CHOWGARH PULULU

*(CHOWGARH TIGERS)*

Translated into Telugu by
T. Kirtivāsa Thirthulu
from Jim Corbett's
*Man-Eaters of Kumaon*

PRINTED IN INDIA
AT THE JUPITER PRESS PRIVATE LTD., MADRAS 18 AND PUBLISHED
BY GEOFFREY CUMBERLEGE OXFORD UNIVERSITY PRESS, MADRAS 2

# వి ష య సూ చి క

# తొలి పలుకు

జిం కార్ బెట్ మహాశయుని యాంగ్లరచనలోఁ జమత్కార మెడనెడ గోచరించుచుండును. దాని ననువాదములోనికిఁ గొనివచ్చుటకై యత్నించినాను.

ఆంధ్రీకరణములో నర్థవ్యక్తికొఱకును, విరూపత్వ నివారణకును సంధు లచ్చటచ్చట విడఁగొట్టినాను. సంస్కృతాంధ్రపదములు సరిపోనపుడు హిందీభాషా శబ్దములు చాల కొలఁదిగా వాడినాను. ఆంగ్లపదముల కనువగు శబ్దము లేనపుడు కేవల మాంగ్లపదములనే యథాతథముగా నుపయోగించినాను. సామాన్యముగా నట్టి తావులలో నాంగ్ల శబ్దములే సులభ గ్రాహ్యములు.

ఈ రచన యనువాద మనిపింపకుండునట్లును, ధారాళముగా నడచునట్లును బ్రయత్నము చేసినాను.

సాహితీ సమితి, ఒంగోలు
1 మార్చి 1956

కృత్తివాస తీర్థులు

# పీఠిక

హిందూదేశ పటముమీద నీ దృష్టి దక్షిణమునుండి సూటిగా పైకి పోనిచ్చినచో గంగానదీ మైదానము హిమవత్పర్వత పాదములతో గలిసినచోట 'ఉత్తరప్రదేశ' రాష్ట్రమును గాంచెదవు. కుమాన్ డివిజన్ ఏతద్రాష్ట్రమున కుత్తర దిశగా నున్నది. ఇందు పర్వతములపైనుండు నైనితాల్ ఆల్మోరా, ఘుర్‌వాల్ జిల్లాలు చేరియున్నవి. ఈ మండలములు నిస్సారములు. ఇందు నిట్రములైన కొండలు, లోయలును గలవు. కొండల చరియలపై గ్రామములు వికీర్ణములై యున్నవి. ఈ జనపదములు పరిమాణమున కొన్ని పెద్దవి కొన్ని చిన్నవి. కొన్నిట వందమంది జనులుందురు. మరి కొన్నిట కొద్ది జనాభాగాని చిన్న కుటుంబములుగాని యుండును. గ్రామములకుమధ్య రోడ్లులేవు. కాలిదారులు మాత్రముండును. ఈ పల్లెలకు వార్తాసౌకర్యము 'కూఁయ్' అని చిత్రమైన కేకలు చప్పట్లద్వారా జరుగును. ఈ కేక సుదూరము వినఁబడును. ఇచ్చటనున్న జనులు హిందువులు. వారు మాట్లాడుభాష హిందూస్తానీ. వారి జీవనాధారము వ్యవసాయము. ప్రదేశము నిస్సారమగుట జేసి వారు పేదవారు.

అడవులను ఛేదించిన ప్రదేశమున వ్యవసాయము జరుగును. అరణ్యమయమైన ప్రాంతము కొద్దిగనో గొప్పగనో

వేఁట కనుకూలము. ఇచ్చట శీతోష్ణమతిగనుండును. శీతకాలమున దట్టముగ మంచుకురియును. వేసవిలో ఎండలు మండిపోవును. అట్టి పరిసరములు నరమాంసమును మఱగిన వ్యాఘ్రముల కాటపట్టు. ఆ బెబ్బులులకు పల్లీయులు భీతిల్లెదరు.

వ్యాఘ్రమునకు నరులను భక్షించెడి యలవాట్లు స్వభావసిద్ధము కాకపోయినను, ఆ ప్రకృతి యెట్లేర్పడినదో వివరించుట ముఖ్యము.

నరమాంసమును మఱగిన వ్యాఘ్రము, పరిస్థితులకులోనై, తనవశముకాక, అస్వాభావికమగు నాహారమున కలవడును. పదింట తొమ్మిదిపాళ్ళు పులి నరమాంసభక్షిణి యగుటకు గల కారణము తాను తిన్నగాయమే. ఒకపాలు, ముదుసలి వయసున తప్పనిసరిగా మానవభక్షిణి యగును. వేఁటకాని తుపాకీదెబ్బ సరిగా తగులకపోవుటచేతనో, అతఁడు వ్యాఘ్రమును వెంటాడి క్షతజంతువును పొందలేకుండుట చేతనో లేదా ముండ్లపందిని హతమార్చునపుడు, కోపాటోపము చేతనో, పులి నరమాంసము నభిలషించును. ఏదుపంది ముండ్ల యీఁకెలు వ్యాఘ్రమునకు గ్రుచ్చుకొనును. వానిని పెరికివేయ సాధ్యముకాదు. నరుఁడు వ్యాఘ్రముల స్వాభావికాహారముకాదు. గాయములచేతనో ముసలితనమువలననో శక్తి యుడిగినపుడు, పులి తనజీవనార్థము నరునిమాంసమును కోరును.

పులి స్వాభావికాహారమునకై జంతువును వధించుటకు సగర్వముగ నడుగులు వేయుచునో లేక నిరీక్షణ

చేయుచుండును. దాని విజయము చాలవరకు గమన వేగముపై, కొంతవరకు దంతములు పంజాలపైనను నాధార పడియుండును. క్షతగాత్రమగుటచే వ్యాఘ్రము బాధపడు చున్నపుడు లేదా దంతములు పనికిరాక యూడిపోయినపుడు, పంజాలఱిగిపోయినపుడుగాని తాను తినుట కలవాటుపడిన జంతువులను పట్టుకొనలేదు. అప్పుడు పులి నరుని వధించుట తప్పనిసరియగును. జంతువుల మాంసమును విడిచిపెట్టి మానవుని మాంసమును తినుటకుగల మార్పు చాలవరకు హఠాత్సంభవము. కుమాన్ ప్రాంతీయులైన గ్రామీణులు నరమాంసమునకు మఱగిన వ్యాఘ్రముల రాకపోకలకు నలవాటు పడినవారు. అందువలన వారు పులులను నివారించుటకై తగు శ్రద్ధతీసికొందురు. కాని వారు నిరాయుధు లగుటచేసి గ్రామసీమను దాటిపోవునప్పుడు పులులవలన ప్రమాదమునకు లోనగుచుందురు. ప్రతిసంవత్సర మీ బెబ్బులులకు పల్లీయులు నాహారమగుచుందురు. పులులను వారించు యత్నములు వమ్మైపోగా, గ్రామీణులు కల్నల్ జిమ్ కార్బెట్ అను వేటాడుటలో దిట్టను, అప్పుడప్పుడు ఆహ్వానించి నరమాంసభక్షిణులైన పులుల బారినుండి రక్షణ వేడుదురు. వీలున్నపుడెల్ల మహావీరుడగు కార్బెట్ గ్రామీణుల రక్షణకుఁ బూనుకొనెను.

జిం కార్బెట్ యౌవనమునుండియు వనవాసజీవితమున కలవాటు పడియుండెను. పాఠశాలను వీడిన తరువాత నతఁడు రైల్వేశాఖలో Fuel Inspector గాను, తరువాత Transhipment Inspector గాను మోకమాఘాటులో

నుద్యోగిగానుండెను. ఈ వృత్తిలో నిరువదేండ్లు గడపినాఁడు. ఉద్యోగములో జీవితాంతమువరకును (అనగా ఏప్రిల్ 1955) నతఁడు తీరికగానున్న సమయమున తూర్పుదిశనున్న కుమాన్ ప్రాంత గ్రామములను మానవభక్షిణులగు వ్యాఘ్రముల బారినుండి రక్షించెడివాఁడు. అనంతరము డెబ్బదియవయేట పదవీవిరమణ సందర్భమున పులులను వేఁటాడుటలో తనకు గల అనుభవములను వ్రాసి ప్రకటింపఁదలఁచెను.

జిం కార్బెట్ తన గ్రంథమును ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ వారి ఇండియన్ బ్రాంచికి ప్రకటనార్థ మొసఁగినాఁడు. వెంటనే గ్రంథము 1944 లో ముద్రితమైనది. కుమాన్ Man-Eaters అను పేరుగల గ్రంథము ప్రపంచప్రసిద్ధి పొందినది. ఈ గ్రంథమందలి కథలన్నియు నిజముగ జరిగినవే. ప్రతిదేశమందలి పిన్నపెద్దలకును ఔత్సుక్యమును గలిగించినవి. హిందీలోనూ మొత్తము పదునారు భాషలలో నీ గ్రంథమున కనువాదములు వెలువడిన వన్నచో ఆశ్చర్యపడ నవసరము లేదు.

ఈ గ్రంథములో నొక కథ కాంధ్రానువాదము తొలిసారి ముద్రించినాము. మరికొన్ని కథలనుగూడ మున్ముందు ప్రకటింపఁదలంచినాము.

I

# తొలి ప్రయత్నము

నా కెదురుగా గోడపై వ్రేలాడుచున్న తూర్పు కుమావన్ ప్రదేశపటముమీఁదఁ గొన్ని × గుఱుతులు పెట్టియున్నవి. ప్రతి చిహ్నముక్రిందను తారీఖు వేసియున్నది. గుఱుతులు ప్రదేశములనుసూచించును. నరమాంసమునకలవడిన చౌగర్ పులి నోటఁ బడి, యాధికారికముగా నమోదయిన జనుల సంఖ్యను తారీఖు సూచించును. పటముపై యిరువదినాలుగు చిహ్నము లున్నవి. ఈ మొత్తము సరి యైన దని కచ్చిత ముగాఁ జెప్పలేను. ఇయ్యవి రెండువత్సరములపాటు మాత్రము నమోదయినవి. ఈ కాలములో నిహతు లయినవా రందఱ సంఖ్య నాకుఁ దెలియరాలేదు. గాయపడి, పిదపఁ జనిపోయిన వారి విషయములో × చిహ్నము కాని, తేదీ కాని నేను వేయనే లేదు.

మొదటి చిహ్నము క్రింద క్రీ. శ. 1925 సంవత్సరము, డిసెంబరు 15 తారీఖు కలదు; తుదిదాని క్రింద 1930, మార్చి 21, తేదీ వేసి యున్నది. ఈ రెండు గుఱుతులకును నడుమ నున్నదూరము — ఉత్తర దక్షిణములుగా నేబది మైళ్ళు, తూర్పు పడమరలుగా ముప్పది మైళ్ళు: మొత్తము విస్తీర్ణము పదునైదువందల చదరపుమైళ్లు. గుట్టలతో లోయలతోఁ గూడిన యీ ప్రదేశమునఁ జలికాలములో మంచు

దట్టముగా నిండియుండును; వేసవికాలమున లోయలు మల మల మాడుచుండును. చౌగర్ పులి యీ ప్రదేశమున భీకరప్రాభవము నెలకొలుపుకొనెను. వివిధపరిమాణములు కల గ్రామములు—వందకాని, కొంచెము హెచ్చు జనాభా కలవి కాని, ఒకటి రెండు చిన్న కుటుంబములు కలవి కాని—ఈ ప్రదేశమునం దంతటను విసరివేసిన ట్లున్నవి. వట్టి కాలినడకవల్ల గట్టిపడిన కాలి బాటల మూలముననే గ్రామములకు రాక పోకలు జరుగుచుండును. ఈ బాటలలోఁ గొన్ని కాఱడవులగుండఁ బోవును. మనుష్యులను దినమఱిగిన బెబ్బులివలన భయోత్పాతము కలిగినపుడు జనులు కేకలు వేయుచుఁ గరతాళధ్వనులు కావించుచు సాంకేతములు చేయుచుందురు. ఎత్తుచోటఁ గాని, యున్నత పాషాణము మీఁదఁ గాని, యింటి పైకప్పుపైఁ గాని నిలిచి, సమీప గ్రామములోని వారి నాకర్షించుటకై మనుష్యుఁడు కూఁత పెట్టును; ప్రతివచనము వచ్చినప్పుడు తారస్థాయిలో సందేశము తెలియఁజేయును. ఒక గ్రామమునుండి వేరొక గ్రామమున కీ విధముగా నందిన సందేశము దూరప్రాంతములకుఁ గూడ నచిరకాలములోనే ప్రసారిత మగుచుండును.

1929, ఫిబ్రవరి మాసమున జరిగిన జిల్లా సమావేశములో చౌగర్ పులిని వేఁటాడుటకై నిర్ణయించితిని. కుమావన్ తాలూకాలోఁ దత్సమయమున మూఁడు పులు లుండెను. చౌగర్ పులి వలన విశేషనష్టము కలుగుచుండుటచేఁ దదన్వేషణమునకై తొలుత బయలువెడల నిశ్చయించితిని.

కాలా - అగర్ గట్టునకు ఉత్తరమునను, తూర్పునను గల గ్రామములలో ముప్పన్నె మెకము సంరంభము చేయుచుండె నని ప్రభుత్వమువారు నా కొసఁగిన పటముమీఁది చిహ్నములును, తారీఖులును నిర్దేశించినవి. ఈగట్టు రమారమి నలుబదిమైళ్ళ పొడవున నున్నది. ఇయ్యది క్రమముగా 8,500 అడుగుల యెత్తునకు లేచును. శిఖర భాగమున దట్టమయిన యడవి కలదు. ఈ యెత్తు గట్టునకు ఉత్తర దిశగా నటవీమార్గ మున్నది. ఈత్రోవ కొన్నిమైళ్ళపాటు సాంద్ర సిందూరవృక్షముల నడుమగను, అడవి గులాబీపొదల గుండను బోవుచుఁ గొన్నియెడల నడవికిని దున్నిన పొలములకును సరిహద్దుగా నేర్పడుచుండును. ఈమార్గ మొకచో నర్ధచంద్రాకృతిగా నుండును. అందు కాలా-అగర్ ఫారెస్టు బంగాళా కలదు. అయ్యది నా గమ్యస్థానము. నాలుగు దినములు నడచి, నాలుగువేల యడుగుల యేటవాలు ప్రదేశమున కెక్కి, 1929 ఏప్రిల్ మాసములో నొకానొక సాయంసమయమున కచ్చటికిఁ జేరితిని. అక్కడ కిరువదిమైళ్ళ దూరములోనున్న గ్రామమునఁ బది దినముల క్రిందటఁ దొలిసారి పులి కానవచ్చెనఁట. గట్టునకుఁ దూర్పుగా నేటవాలు ప్రదేశమున నొకనిని భార్యతోఁగూడఁ జంపి పులి భక్షించినట్లు తెలియవచ్చెను.

పది దినములనాఁటి జంతువు జాడ వెంటఁ జనుట నిష్ప్రయోజన మని యెంచి, తూర్పు దిక్కున నున్న దల్కానియా గ్రామము చేర నిర్ణయించుకొంటిని. కాలా-అగరుకు దల్కానియా పదిమైళ్ళలో నున్నది. ఆ దంపతు

లను పులి చంపిన గ్రామమునకుఁగూడ సుమారు ముంచుమించుగా నంతే దూరము.

పటముమీఁది గుఱుతులనుబట్టి దల్కానియా ప్రాంతము లోనే పులి నివాస మేర్పఱచుకొనె నని నాకుఁ దోఁచెను.

మఱునాఁ డుదయము అల్పాహార మైన తోడనే నేను కాలా-అగర్ నుండి బయలుదేఱి, అరణ్యమార్గము ననుసరించితిని. అయ్యది కాఱడవి వెంట సాగి, గట్టు తుదివఱకును బోయినది. ఆ బాట వెంట జను లెక్కువగా నడిచినట్లు కానరాదు. నేను జాడ లరయుచుఁ బోవు చుండఁగా మధ్యాహ్నము రెండుగంటలు కావచ్చెను. అప్పుడు దల్కానియా జనులు కొందఱు నా కెదురు వచ్చిరి. తమగ్రామములో నేను విడియుదు నని కూఁత పద్ధతి ప్రకారము విని వారు గట్టుమీఁదికి వచ్చిరి. దల్కానియాకు ఉత్తరముగాఁ బదిమైళ్ళ దూరములోని గ్రామముకడ స్త్రీలు పైరు కోఁత కోయుచుండఁగా నాఁటి యుదయమున వ్యాఘ్రము వారిపైఁ బడె నని నాకు వారు తెలుప వచ్చిరి.

నా మకాము పరికరములను మోసికొని వచ్చుచున్న వారు ముందఱికి సాగిపోవ నుత్సుకులై యుండిరి. కాని, యది కర్కశమార్గ మనియుఁ గాఱడవిగుండఁ బోవుననియు, గ్రామీణులవలన విని, నా పరిజనులను దల్కానియాకుఁ బంపి, శార్దూలము విక్రమించిన ప్రదేశమునకు నే నొంటిగాఁ బోవుటకును నిర్ణయించితిని. నా సేవకుఁడు నిండు భోజనము వండుటకై సిద్ధపడెను. నేను గడుపార భుజించి

సాయంకాలము మూఁడు గంటలకుఁ బదిమైళ్ళు నడకకు దారఁ గొంటిని. అనుకూలస్థితిగతులలోఁ బదిమైళ్లను రెండున్నర గంటలలో నవలీలగా నడువవచ్చును. కాని యిచ్చటి స్థితిగతు లేమాత్రము ననుకూలముగా లేవు. లోఁతు కనుమలలో నడుగులబాట మెలికలు తిరుగు చుండెను; తాలగుట్టలు, దట్టమైన తుప్పలు, వృక్షములు విడిచి విడిచి దాని కంచులు కట్టుచుండెను. ఆఁకలిగొన్న పులిరూపముతోనున్న యాకస్మిక మృత్యు వణఁగియుండుట కవకాశమున్న ప్రత్యవరోధమును జాగరూకతతో సమీ పించుచున్న నాకు నడక మందము కాసాగినది. గమ్యస్థానము కొన్ని మైళ్ళ దూరమున నుండఁగనే యాగుట మంచి దని యస్తంగత సూర్యునివలన నాకు హెచ్చరిక కలిగినది.

మఱి యెచట నైనను నక్షత్రకాంతిలో నెండుటాకులపైఁ బండుకొన్నచో రాత్రి సుఖముగా నిద్రపట్టి యుండును. కాని యిచట నేలపైఁ బండుకొనుట మృత్యుదేవతను శాధాకరవిధానమున నాహ్వానించుటయే యగును. అనుకూలమైన వృక్షమును గనుఁగొని, యందు సుఖముగా నిమిడిపోవు శక్తి బహుకాలానుభవముగా నుండుటచే వృక్షముపై నిద్రించుట నాకు సులభ కార్యమే.

ఈ తరుణమున సిందూరవృక్షమును జేరి, యొక శాఖకు రైఫల్ (తుపాకి) గట్టిగాఁ గట్టి, చెట్టుపైఁ గొన్ని గంటలు నిద్రించితిని. అనంతరము జంతువుల మర్మరధ్వనివలన నాకు మెలఁకువ వచ్చినది. ఆ చప్పుడు ముందటికి సాగిపోయినది. ఇంతలో వృక్షము బెరడుపై గోళ్లబరుకుడు వినవచ్చెను.

ఎలుఁగుబంట్లు తీయని బేరి పండ్లకై కర్ఫలవృక్షములమీఁది కెక్కుచున్నట్లు గ్రహించితిని. ఆహారసమయమున నెలుఁగు బంట్లు హెచ్చుగాఁ గలహించుచుండును. అవి కడుపునిండ ఫలములు నింపుకొని యావల కరిగినఁ గాని నిద్రించుట యసాధ్యము.

సూర్యోదయానంతరము రెండుగంటలకు నేను గ్రామము చేరితిని. చుట్టును విపినము క్రమ్ముకొని యుండఁగా నడుమ అయిదెకరముల భూమి బాగుచేసి, యందు రెండు కుటీరము లను పశుశాలయును నిర్మించిరి. అదియే జనస్థానము. భయ భ్రాంతులై యున్న యా కొలఁదిమంది జనులును నన్నుఁ జూచి హర్షోన్మత్తులయిరి. పైరు కోయుచున్న ముగ్గురు స్త్రీలను సవ్వడి లేకుండ సమీపించుచు, నేలను గఱచుకొని



యున్న పులిని సకాలమునఁ దాము చూచినచోటు వారు నా కాతురతతోఁ జూపిరి. అది కుటీరములకుఁ గొలఁది గజముల దూరములోని గోధుమ పొలము. శార్దూలమును గాంచి

కలవరించినవాఁడు వ్యాఘ్రము మడవిలోనికిఁ జొరఁబడె ననియు, వేఱొక పులి దానికి తోడయ్యెననియు, నా రెండు మెకములును గొండప్రక్కనుండి క్రింది లోయ లోనికిఁ బోయెననియుఁ జెప్పెను. తమ యెర తప్పిపోవుటచే నాశాభంగముచెంది పులులు రాత్రివేళఁ దఱచుగా వచ్చి బొబ్బరింతలు పెట్టిపోవుచుండెనఁట. నా యాగమనమునకుఁ గొంచెము పూర్వమే రాకపోకలు మూరినవఁట. కావునఁ గుటీరములోనివారికి నిద్ర లేదు. రెండుపులు లున్నవని వీరు చెప్పిన విషయము మానవభక్షిణి యగు వ్యాఘ్రివెంట బాగుగాఁ బెరిగిన పులిపిల్ల యున్నదని యిదివరలో నేను విన్నవార్త ధృవపడినది.

కొండజాతివా రెంతయు నతిథిసత్కారపరాయణులు. నేను రాత్రి విపినములో గడపితిననియు, దల్కానియాలో నా మకామనియు విని, వారు నాకు భోజనము వండుటకై సిద్ధపడిరి. వారలకున్న కొలఁది వస్తుసంచయము వట్టిపోవు నని తలఁచి నేను తేనీరు కావలెనంటిని. గ్రామములో తేయాకు లేకపోవుటచే వా రప్పుడే పిండిన పాలలో బెల్లము వేసి నా కిచ్చిరి. త్రాగి సంతృప్తి చెందితిని. వారి కోరికపై మిగిలిన గోధుమపైరు కోఁత యగువరకును కాపు కాయు చుంటిని. వారి శుభకాంక్షలతో మధ్యాహ్నము బయలు దేఱి పులుల బొబ్బరింతలు వినవచ్చిన దిక్కుగా నేను లోయ లోనికి దిగితిని.

లధ్య, నంధార్, తూర్పుగాలాయేరుల పరీవాహప్రదేశము మొదలుకొని నిరువదిమైళ్లవఱకును నైరృతి దిక్కున వ్యాపిం

చిన లోయలో చిక్కని యడవి కలదు. అచ్చట నడుగుల జాడలు తీయుట యసాధ్యము. వ్యాఘ్రములను నావైపున కైనా యాకర్షింపవలెను. లేక, ఆటవికుల సాయముతో సద్దు లేకుండ వాని వెంటనంటవలెను. పులులను గనుఁగొనుట కింతకన్న మార్గాంతరము లేదు.

సాయంసమయమునకు లోయ పైకొనకుఁ జేరితిని. శార్దూలములు కానరాలేదు. ఆ యడవిలోఁ బుండరీకము లున్నట్లు పక్షిసూచనకాని, జంతుసూచనకాని లేదు. లోయమీఁద నుత్తర దిక్కుగాఁ బశుశాల మాత్రము కాన వచ్చినది.

ఈ రెండవ రాత్రి యనుకూలమైన భూరుహము చూచుకొని భంగము లేకుండ సుఖముగా నిద్రించితిని. చీఁకటిపడిన కొలఁదిసేపటికి ముష్వన్నెమెకముల బొబ్బ రింతలు వినవచ్చెను. కొద్దినిముసముల తరువాత రెండు తుపాకుల ధ్వని మాఱుమ్రోఁగిపోయెను. పశువులశాలనుండి కాపరులు మిక్కిలి కోలాహలము చేసిరి. అనంతరము రేయి ప్రశాంతముగా నుండెను.

## II

# పులులు చంపినవి

మఱునాఁడు సాయంకాలమునకు లోయలోని ప్రతిభాగమును బరిశీలించి, దల్కానియాలోని నా పరివారమును మరలఁ గలిసికొనుటకై గడ్డితో నిండిన యేటవాలుప్రదేశముపైకి నేను బోవుచుండఁగాఁ బశుశాల దిశనుండి దీర్ఘముగా మానవుల కూఁత వినవచ్చెను. రెండవమారాధ్వని వినఁబడినంతనే నేను బదులుకూఁత కూసితిని. ముందరికిఁ జొచ్చుకొని వచ్చిన పాషాణముమీఁదికిఁ దోడనే యొకఁ డెక్కినట్లు కానఁబడెను. పులిని వేఁటాడుటకై నైనితాల్ నుండి వచ్చిన దొర నేనే యగుదునా యని వాఁడు బిగ్గరగాఁ గేకవేసెను. అవునని నే నంటిని. మధ్యాహ్నప్రాంతమునఁ దన పసులమంద కనుమనుండి నావైపునకుఁ బరుగెత్తెననియు, శాలకు వచ్చిన పిమ్మట లెక్కింపఁగా తెల్ల యావొకటి కానరాలేదనియు వాఁడు నాకుఁ దెలిపెను.

గతరాత్రి బొబ్బరించుచుండిన పులులు నేను నిలిచియున్న చోటికిఁ బశ్చిమముగా నరమైలుదూరమున నా యావును జంపియుండునని వాఁ డనుమానించెను. ఈసమాచారము చెప్పినందులకు వానికిఁ గృతజ్ఞత తెలిపి, కనుమకు బయలుదేఱితిని. నేను గొలఁది దూరము నడచు నప్పటికి చెదరి

పరుగిడిన మందజాడలు కానవచ్చినవి. వాని ననుసరించి వెనుకకుఁ బోయి, గోవు మృతినొందిన తావు నవలీలగాఁ గనుఁగొంటిని. ఆవును జంపిన పిమ్మట శార్దూలము లేట వాలుగా నున్న కొండప్రక్కనుండి కనుమలోనికి దానిని గొనిపోయినవి. ఆ చాలు వెంట దానిని సమీపించుట యనుచితము. కావునఁ గ్రిందిలోయలోనికి దిగి, బాగుగా చుట్టు తిరిగి, లోయ కావలితట్టున మృతినొందిన జంతు వుండు నని తలఁచిన చోటు సమీపించితిని. ఈప్రక్క యెక్కువ యేటవాలుగా లేక క్రొత్త చిట్టడవితో నిండి యుండెను. ఛాయవలె నిశ్శబ్దముగా నడుగులో నడుగు వేయుచు, నా నడుమువఱకును వచ్చు చిట్టడవిలోఁ జను చుంటిని. కనుమ యడుగు భాగము రమారమి ముప్పది గజములలో నుండఁగా, నా కెదురుగా నేదో కదలినట్లు కానవచ్చెను. తెల్లని కా లాకస్మికముగా నాకసములోనికి లేచి గిలగిల కొట్టుకొనెను. మఱు నిమేషములో చిరాకుతోఁ గూడిన గుఱ్ఱు మను ధ్వని వినఁబడెను. ఎరమీఁద నున్న పులు లేదో కబళమునుగూర్చి వివాదపడినట్లు తోఁచెను.

కొన్ని నిముసములసేపు నేను నిశ్చలముగా నుంటిని. ఆ తెల్లనికాలు వణఁకుచుండెను. గుఱ్ఱు మరల వినఁబడలేదు. అంతకన్న దగ్గఱకుఁ బోవుట యుచిత మనిపించ లేదు. నేను వ్యాఘ్రములకుఁ గనఁబడకుండ యా ముప్పదిగజములు దాఁటఁ గలిగి, వానిలో నొకదానిని సంహరింపఁ గలిగినను రెండవ పులి నావైపు దుముక వచ్చును. నే నపుడు నిలిచియున్న ప్రదేశమున నా ప్రాణరక్షణమున కవకాశము లేదు.

నా కెదురుగా నెడమవైపుగా నిరువదిగజముల దూరమునఁ బది మొదలు పదునైదడుగుల యెత్తు తేలిన రాలగుట్ట కలదు. పులులకుఁ గానఁబడకుండ ఆగట్టు నేను జేరఁగలిగి నచో వానిపై నవలీలగాఁ దుపాకీ ప్రేల్చుట కవకాశ మున్నది. మోఁకాళ్ళమీఁది కొరగి నెమ్మదిగా రైఫిల్ నెట్టుచు, చిట్టడవిలోఁ బ్రాఁకి పోవుచు రాల వెనుకకుఁ జేరితిని. ఒక్కనిముసమాగి తుపాకిలో తోటా లున్నవో లేవో చూచి, రాతిమీఁది కెక్కి, దృష్టి ననుసంధానము చేయఁగా రెండు పులులు కానఁబడినవి.

ఒక పులి యావు వెనుకభాగమును దినుచుండెను; రెండవది దానిదగ్గఱగాఁ బండుకొని పాదములు నాకుకొను చుండెను. రెండు శార్దూలముల పరిమాణ మించు మించుగా సమానము. పంజాలు నాకుకొనుచున్న పులివన్నె రెండవ దాని వన్నెకన్నఁ జాల తేలికది. తేలికరంగు వార్ధకముచేఁ దేలెననియు, అదియే ముసలి పులి యనియు నెంచి, 'ఈగలు' (sights) దానికి గుఱిచేసి తుపాకి ప్రేల్చితిని. ఆదెబ్బ కది పైకిలేచి, వెనుకకుఁ బడిపోయెను. రెండవపులి యెగిరి దుమికి కనఁబడక కనుమలోనికిఁ బరుగెత్తెను. రెండవ 'గుఱ్ఱము బిస' (trigger) నొక్కుట కవకాశము లేక పోయెను. నేను గొట్టినపులి మరలఁ గదలలేదు. అది చచ్చి నదో చావలేదో నిర్ధారణ చేయుటకై రాలురువ్వి, దగ్గఱకుఁ బోయి చూచునప్పటికి నిరుత్సాహము కలిగెను. పొరపాటున పులిపిల్లను ప్రేల్చితినని కనుగొంటిని. ఈ పొరపాటువలనఁ దరువాత పండ్రెండు మాసముల కాలములో ఆ జిల్లాలోఁ

బదునైదుగురు ప్రాణములు కోల్పోయిరి; అకస్మాత్తుగా నా ప్రాణములుకూడా పోవునంతటి ప్రమాదము సంభవించెను.

చాకుతో శార్దూలచర్మము నొలుచునప్పటికి సూర్యాస్తమానము కావచ్చెను. ఆ రాత్రి కాననములోఁ గడపుట తప్పనిసరి యగుటచే నున్నచోటనే నిలువ నిశ్చయించితిని. పంజా గుఱుతులనుబట్టి చూడఁగా నా యూఁడు పులి చాల ముసలిది యని తోఁచినది. ఆ మండలములోనున్న తుపాకుల నన్నిటి నుపయోగించుటకుఁ దగినంత జన మున్నను నచటఁ దిరుగుచున్న పులి మానవులను, వారివిధానములను గ్రహింపనేలేదు. అటు లయ్యును రాత్రివేళ నెపుడో యా పులి యెరకడకుఁ జేరి, యుదయమున వెలుతురు వచ్చు వరకును యచట నుండవచ్చు ననుకొంటిని.

అనువైన వృక్షమును వెదకుటకుఁ దగినన్ని చెట్లు లేవు. తుద కొక చెట్టుపైఁ దెల్లవాఱువఱకును నిద్రించితిని. అనుకూల్యము లేని యట్టి వృక్షమున పండ్రెండు గంటలకాలము నే నెన్నఁడును గడపలేదని తోఁచినది. ఆఁడుపులి రేయెల్ల నడుమ నడుమ బొబ్బరించుచుండెను. ప్రభాతము కావచ్చు కొలఁదిని శార్దూలము బొబ్బరింతలు క్షీణములగుచు, నా పై భాగముననున్న మిట్టమీఁదుగాఁ దుదకుఁ వినఁబడకుండ లీనమై పోయెను.

ఒడలు తిమ్మిరియెక్కి, కొయ్యవాఱి, అఱువదినాలుగుగంటలాహారము లేకుండ నుంటిని. రాత్రివేళ గంటసేపు వానకురియుటచే నా దుస్తులు తడిసి, శరీరమున కంటుకొన్నవి. వస్తువులు బాగుగాఁ గనఁబడు వేళకు నేను తరువుదిగి, పులి

తోలు నా చొక్కాలోఁ గట్టి, దల్కానియావైపు వెడలి పోతిని.

నా పరివారజను లొకయంగణములో నించుమించుగా నూఱుగురు గ్రామీణులతో నేదో సంప్రతించుచుండిరి. గజము వెడలుపుగొంది వెంట సమీపించిన నన్ను వారు చూడలేదు. కూరుచున్న జనసంఘములోనికి నేను దూలుచుఁ జేరునప్పటికి వారు పలికిన స్వాగతవాక్కులు స్మృతి యున్నంతవఱకును మఱచిపోవలేను.

గ్రామమునకు నూఱుగజముల దూరమున పొలములో నా డేరా పాతినారు. డేరాను సమీపించితినో లేదో నాకై మేజాపై తేనీటిపాత్ర నుంచినారు. రెండు సూట్ కేసులతోను గ్రామమునుండి యెరవు తెచ్చిన రెండు బల్లచెక్కలతోను ఆ మేజా సిద్ధమయినది. కొన్ని సంవత్సరములపాటు నా వెంట నున్న పరివారజనులు నన్ను పులి బలిగొన్నదని నమ్మక, నేను మరలి వత్తునని రేయుంబవలును తేనీటిపాత్ర నిప్పులమీఁదనే యుంచి రని గ్రామీణులు నాకుఁ దరువాతఁ జెప్పినారు.

ఉడుకునీళ్ల స్నాన మైనపిమ్మట నేను గడుపునిండ భుజించి, రేయి గడపుటకై లోనికిఁ బోవనెంచితిని. అంతలో మెఱపు మెఱసెను, పిడుగు పడెను. తుపాను రా నున్నదని కాల సూచన యయ్యెను. ఆ ఝంఝూవాతము గంటసేపు వీచెను. ఆ చిన్న డేరా తట్టుకొన్న తుపానులలో నది దుర్భర మయినది. నా వస్తువులు చాలవఱకుఁ దడిసి ముద్ద లయ్యెను. ఈ చివరనుండి యా చివరవరకును గొన్ని

యంగుళములలోఁతున నీరు ప్రవహించెను. నా పడుక మాత్రము చాలవఱకు పొడిగా నుండెను. తోటాలు కూర్చిన రైఫిల్ ప్రక్క నిడుకొని, పదిగంటలకుఁ బండుకొని, పంద్రెండు గంటలకాలము నిద్రించితిని.

నా సామాను రెండఁబెట్టుటలోను, పులితోలు శుభ్ర పఱచి, కొయ్యచీలలుకొట్టి యారఁబెట్టుటలోను మఱునాఁడు గడచిపోయెను. మెట్లు మెట్లుగా దున్నిన పొలము మొగదల ఆ సాయంకాలము కూరుచుండి, మంచి దూరదర్శిని (binoculars) చేతఁ బట్టుకొని, పటము నా ప్రక్కనఁ దెఱచి యుంచితిని. మూఁడు వత్సరముల కాలములో నెక్కడెక్కడ నిరువదిమంది పులిచే నిహతు లయిరో, యాయాప్రదేశము లను గ్రామీణులు పటముపై నాకుఁ జూపిరి. నలుబది చదరపుమైళ్ళ విస్తీర్ణము కల సీమలో నించుమించుగా సమాన దూరములలో హత్యలు జరిగినవి.

ఈ ప్రాంతములోని యడవులలోఁ బశువులు ధారాళ ముగా మేయవచ్చును. అచటికిఁ బోవు పశువుల పుంతలలో నాలుగు చిన్న దున్నలను గట్టివేయుటకై నిశ్చయించితిని.

అనంతరము పదిరోజులవఱకును ఆఁడు పులి వార్త తెలియరాలేదు. నేను ప్రాతఃకాలమునఁ బోయి దున్నపోతు లను జూచుటతోడను, పగటివేళ నడవిని బరిశీలించుట తోడను, సాయంసమయమున దున్నపోతులను గట్టివేయుట తోడను కాలము గడచుచుండెను.



# III

# వైద్యశాస్త్ర విజయము

పదునొకండవనాఁడు నా డేరాకు మీఁదిభాగముననున్న గుట్టపై నుంటిని. గ్రామమున కావలివైపున అరమైలు దూరములో పులి యప్పుడే యొక స్త్రీని సంహరించిన దని నాకు వార్త వచ్చెను. గుట్టవాలున నేను పరుగిడి పోవగా జను లంగణములో గుమిగూడి యుండుట కాన వచ్చెను. ఆ సందులో నారాక నెవ్వరును గమనింపలేదు. నేలమీఁదఁ గూరుచున్న బాల వారి శిరములపైగా నాకుఁ గనఁబడెను. ఆమె లేఁత శరీరముపైనుండి లాగుటచే వస్త్రములు చినిగిపోయినవి. ఆమె మెడ వ్రేలవేసి వెనుక చేతులమీద నానుకొని కదలక మెదలక కూరుచుండి యుండెను.

నారాక చూచినవెంటనే బాలికను నేను సమీపించుటకై వారు త్రోవచేసిరి. ఆమె గాయములను నేను బరిశీలించుచుండఁగా నిరువదిమంది యేకకాలమున మాటాడుచు, కొందఱు జనుల యెదుటనే పులి యించుమించుగా ననాచ్ఛాదిత తలమున బాలపైఁ బడెనని తెలిపిరి. వారి కేకలు విని పులి యామెను విడిచిపెట్టి, యడవివైపునకు వెడలి పోయెనఁట. మృతినొందిన దను భావముతో వా రామెను

పడియున్న చోటనే విడిచి, యీ వృత్తాంతము నాకు నివే దించుటకై పరుగెత్తుచు గ్రామమునకు మరలి వచ్చిరఁట. అనంతరము బాలిక చైతన్యము కలిగి స్వయముగా గ్రామ మును జేరుకొనెను. గాయములవలన నామె కొలఁది నిముస ములలో మరణించుననియు, పులి దాడిచేసిన ప్రదేశము నకే శవమును గొనిపోవుదు మనియుఁ జెప్పిరి. ఆమె కళే బరముకడ నే నుండి, పులిని సంహరింపవచ్చు ననిరి.

వారీ విషయముల నివేదించుచున్నప్పుడు బాలిక తన నేత్రములు నా ముఖముమీఁదనే నిలిపి, భీతిచెందిన జంతువు వలె కన్నీరొలుకు వెఱగు చూపుతో నా కదలికల ననుస రించుచుండెను. ధారాళముగాఁ గదలుట కవకాశము, మనస్సు చిక్కఁబట్టుటకు శాంతి, బాలిక పీల్చుటకు పరిశుభ్ర మైన వాయువు ముఖ్యములు. అందులకై నే నవలంబించిన పద్ధతులు తగినంత మృదువుగా నుండలే దని తలఁతును. చివరివాఁడు సంభ్రమముతో వెడలిపోయిన వెనుక నీరు కాచవలసినదని స్త్రీలను నియోగించితిని. ఇంచు మించుగాఁ బరిశుభ్రముగా నున్న నా చొక్కాను పట్టీలుగాఁ జింపుఁ డంటిని. కత్తెర తెమ్మని యామె సోదరిని బంపివేసితిని. త్రుప్పు పట్టిన ప్రాఁతకత్తెర యామెకు లభించినది. రక్త ముతో నట్ట కట్టిన యామె చిక్కని కేశపాశముల నటులనే యుంచ నిశ్చయించితిని.

పెద్దగాయములు రెండును పులి గోటిగాయములు. ఒకటి కనులనడుమ మొదలయి, సూటిగా శిరసుమీఁదికిఁబోయి మెడ క్రింది వఱకు వ్యాపించి యున్నది. కపాలముమీఁది

చర్మము సమముగా విభక్తమయి వ్రేలాడుచున్నది. రెండవ గాయము మొదటిదానికడనే ప్రారంభమయి, నుదిటి కడ్డముగా కుడిచెవివఱకును వ్యాపించినది.

ఒకానొక వైద్యమిత్రుని నేనొకప్పుడు పులివేటకై కాలినడకను గొనిపోతిని. అతఁడు నాకు రెండు ఔన్సుల పసపుఁబచ్చని ద్రవ మున్న సీసా బహుమానముగా నిచ్చెను. షూటింగ్ జాకెట్ లోపలి జేబులో నాసీసా నుంచితిని. సంవత్సరముపైఁగా దాని నుంచుటచేఁ గొంత ద్రవ మిగిరి పోయినది. కాని యింకను సీసాలో మూఁడువంతులు ద్రావక ముండెను. బాలిక శిరస్సును శరీరమును గడిగి సీసామూఁతిని విఱుగఁగొట్టి గాయములలో ద్రవమును దుదిచుక్కవఱకును బోసితిని. మస్తకముమీఁది చర్మమును యథాస్థానమున నిలుపుటకై తలకు కట్టు కట్టి, యాపిల్ల నెత్తుకొని యామె యింటికిఁ దీసికొనిపోయితిని.

ద్వార సమీపమున వాసమునకు వ్రేలాడుచున్న గంప లోని శిశు వాకలిబాధచే ఘోషించుచుండెను. ఈ చిక్కు నేను బరిష్కరింపలేక యచ్చటి స్త్రీలకు వదలితిని. ఆ తరువాత బదిదినములకు నేను బోయినపుడు తుదిసారి యామెను జూచితిని. నిద్రించుబిడ్డ నొడిలో నిడుకొని, తనయింటి గడపపైఁ గూరుచున్న యామెను గాంచితిని. మెడ జీవముమీఁద బులిగోళ్ళు లోఁతుగా దిగఁబడిన వ్రణము తప్ప తక్కిన గాయములన్నియు నయమయినవి. తలపైఁ జర్మము చక్కఁగా నంటుకొన్నట్లు నాకుఁ జూపుటకై కాకిరెక్కలవలె నల్లని కేశరాశి నావలకుఁద్రోసి చిఱునగవుతో, మంచి

కత్తెర తన చెల్లెలికి లభింపనందులకుఁ దన కెంతో సంతోష ముగా నున్నదని యామె పలికెను. కత్తిరింపుచేసిన తల వైధవ్య సూచకము కదా!

నే నామెకుఁ బరిచర్య చేయుచుండఁగా నా పరివార జనులు మేఁకను గొని వచ్చిరి. ఆమె నడచిన త్రోవలోని రక్త చిహ్నములను బట్టి వ్యాఘ్రము దాడి చేసిన ప్రదేశ మును గనుఁగొని యచ్చటి పొదకు మేఁకను గట్టివేసి, యా ప్రాంతములోనున్న యేకైక సిందూరతరువు నెక్కి రేయం తయు మేల్కొనియుండుటకై సంసిద్ధుఁడనైతిని. నిదురపట్టుట దుర్ఘటము. నేను గూరుచున్నతావు నేల కెక్కువ యెత్తున లేదు. పులి కాహార మింకను లభింపలేదు. కాని రాత్రి యంతయు నా కేమియుఁ గానరాలేదు, వినరాలేదు.

గత సాయంకాలము పరీక్షించుట కవకాశము లేక మఱుసటి ప్రాతఃకాలము నేలను పరికించి చూచితిని. పులి యామెపై దుమికినతరువాత లోయ కరమైలు పైకిఁ బోయెను. అచ్చట నందార్ నదివరకుఁ బశువుల పుంత కలదు. పులి యీ మార్గమున రెండుమైళ్ళు నడచి దల్కానియా పైభాగమున నున్న కనుమమీఁద నటవీ మార్గము కలియువరకును బోయెను. అది గట్టినేల యగుటచే నాకుఁ బులిజాడలు కానరాలేదు.

రెండురోజులపాటు చుట్టుప్రక్కల గ్రామములవారు తమ నివాసములు విడిచిపెట్టలేదు (ఈవలకు రాలేదు). దల్కాని యాకు దక్షిణమున నయిదుమైళ్లదూరములో నున్న లోహాలీ గ్రామమున నొకరిని పులి యాహుతి గొన్న దని

మూఁడవనాఁడు నలుగురు జంఘాలికులు వార్త తెచ్చిరి. ప్రయాణసన్నాహములు త్వరలో ముగించి మధ్యాహ్నా నంతరము నేను నలుగురు సహచరులతో బయలువెడలితిని. దల్కానియాకు దక్షిణమున నున్న పొడుగుపాటి కనుమపైకి రెండుమైళ్లమేర పండ్ల బిగువున నెక్కితిమి. హత్య జరిగినట్లు చెప్పిన ప్రదేశము మూఁడుమైళ్ల క్రిందుగాఁ గానవచ్చెను. మే మున్నచోటినుండి యేటవాలుగా నున్న కొండ దిగుటకు మార్గమేమియు లేదు. కనుమ వెంట నరమైలు నడచి, యేట వాలుగా నున్న పుంత వెంటఁ జనినచో సూటిగాఁ గ్రిందికిఁ జేరి తనుగ్రామము దాఁటి క్రింది లోయలోఁ గానఁబడు చున్న లోహాలీ గ్రామము చేరవచ్చునని వారు తెలిపిరి. మేము గుట్టవెంట సగము దూరము పోవునప్పటికి మ మ్మేదో జంతు వనుసరించుచున్న ట్లకారణముగా నాకస్మికముగాఁ దోఁచెను. తర్కవితర్కము లప్పుడు నిష్ప్రయోజకములు. ఈ ప్రదేశ మంతటిలో మానవభక్షిణి యొక్కటే యున్న దనియు, మూఁడుమైళ్ల దూరమున ఎరను బలిగొన్నదనియు దానిని విడుచుట కవకాశ ముండదనియు, నే ననుకొన్నను ప్రయోజనము లేదు. ఆతురభావము విడువకుండుటచే నా పరిజనులను గూరుచుండఁబెట్టి, కదల వలదని చెప్పి పరీక్షార్థము బయలుదేరితిని. తొలుత గుట్టమీఁదికి మేము చేరినస్థానమునకు మరలిపోయి, యడవిలోఁ బ్రవేశించి నా పరిజనులు కూరుచున్నచోటికి జాగరూకతతో మరలిపోతిని. పులి, సమీపములో నెచటనైన నున్నదని సూచించుటకై పశుపక్షుల కలవరధ్వను లేవియు వినరాలేదు. కాని

యచ్చోటినుండి పరివారజనులను నాముందుగా నడపించు కొని పోవుచు, నా బొటనవ్రేలు రైఫిల్ సేఫ్టీక్యాచ్ పై నుంచి, తఱచుగా వెనుదిరిగి చూచుచుంటిని.

మేము గ్రామమును జేరినంతనే నా సహచరులు సెలవు వేఁడిరి. నేను సంతోషపూర్వకముగా నంగీకరించితిని. పులి న న్ననుసరించుచున్న దను భావ ముం దెప్పుడో తొలఁగి నందున నా ప్రాణరక్షణముమాత్రమే చేసికొనవలసి యున్నం దున నెక్కువ సురక్షితముగాను, సుఖముగా నుంటిని.

గ్రామమునకుఁ గొంచెము దిగువ నిర్మలోదక మూరెడి బుగ్గ కలదు. ఇచ్చట మెత్తని తడినేలపై పులి నూతన పాదచిహ్నములు కనుఁగొంటిని. లోహాలీవైపునుండి వచ్చుచున్న యీ యడుగు జాడలవలనను, గుట్టపై నాకుఁ గలిగిన యాతురభావమువలన నేదో ప్రమాదము కలిగె ననిపించినది.

లోహాలీగ్రామమున నయిదాఱు చిన్నయిండ్లు కలవు. అందులో నొకయింటిగుమ్మముకడఁ గొందఱు జనులు గుమి గూడియుండిరి.

ఏటవాలుగా, అంతస్తులుగా నున్న పొలములపైనుండి వచ్చుచున్న నన్ను గమనించి కొలఁదిమంది యెదురువచ్చిరి. వారిలో నొకవృద్ధు నా పాదములు స్పృశించుటకై వంగి, బాష్పములు చెక్కిళ్లపై జాలువాఱుచుండఁ దన పుత్రికా ప్రాణములు రక్షింపు మని నన్ను వేఁడెను. ఆతని విషాదకథ కొలఁదిలో ముగించినాఁడు. మధ్యాహ్నము వంట చేయుటకు వలయు నెండుకట్టె లేఱుటకై రమారమి పదిగంటలవేళ నామె

బయలు దేఱెనఁట. నిజగృహమునకు నూటయేబదిగజముల దూరములో చిన్నవాఁగునకావల, పర్వతపార్శ్వమున నామె తిరుగుచుండెనఁట. పిమ్మటఁ గొలఁదిసేపటికి వాఁగులో బట్ట లుదుకుచున్న స్త్రీలు కొంద ఱార్తనాదము విని పైకి చూచిరి. ఆమెయు బెబ్బులియు నేకకాలమున దట్టమైన ముండ్లపొదలలో నదృశ్యమయిరఁట. భయభ్రాంత లైన యా స్త్రీలు గ్రామమునకుఁ బరుగెత్తిపోయిరి. క్షతగాత్ర యైన యామె యరగంట ప్రాఁకుచుఁ బోయి యిల్లు చేరెను. పులి తనపై దుముకఁబోవు క్షణములో నామె కనుఁగొని యించుమించు నిటారుగా నున్న పర్వతపార్శ్వమునుండి క్రిందికి లంఘించెను. ఇంకను భూమినంటకుండ మధ్య గాలి మార్గములోనే పులి యామెను పట్టుకొన్నది. ఇరువురును గుట్టక్రిందికి దొరలిరి. వాఁగుకడకు వచ్చువరకు నామె కేమియు జ్ఞప్తి లేదు. సహాయార్థము కేకలు వేయుటకు శక్తి చాలక, చేతులతో మోఁకాళ్లపై బ్రాఁకుచు నామె గ్రామము చేరుకొనెను.

ఆమె దీనావస్థను వర్ణింప యత్నింపను. పాపము! ఆమె యర్థచేతనావస్థలో నుండెను. రాత్రివేళ నామె యాతన అంతరించినది.

మకామునకు మరలిపోదునన్నఁ జాల ప్రొద్దు పోయినది. కావున తోటా లెక్కించిన రైఫిల్ నాప్రక్క నుంచికొని అశ్వత్థవృక్షము నానుకొని కూర్చుండి యా రేయి గడపితిని.

IV

# మంచి అవకాశము కోల్పోవుట

ఈ దీనురాలి యనుభవమును బట్టియు, దల్కానియాలోని యా బాలను బట్టియు, ముసలిపులి తాను పైఁబడిన మానవులను సంహరించుటకై తన శాబకముమీఁద చాల వఱ కాధారపడి యుండె నని స్పష్టమాయెను. నరమాంసమున కలవడిన పులులు పైఁబడిన నూఱుగురిలో సామాన్యముగ నొకఁడు తప్పించుకొనఁ గలుగును. కాని యీ పులి పెక్కురను పూర్తిగా సంహరించుటకన్న గాయపఱచు నని తోఁచెను. ఏఁబదిమైళ్లలోపున వైద్యశాల లేదు. కావున నేను నైనితాల్ చేరినంతనే వ్యాఘ్రము విహారము చేయు పల్లెలలోని గ్రామాధికార్లకు పట్టీలు (కట్లు) క్రిమిహరౌషధములు పంపవలసినదని దొరతనమువారి

ఆవలఁ గొంతకాలమునకు నేను మరల నచటికిఁ బోవునప్పటికి నా విన్నపము మంజూరయినట్లును, ఔషధములవలనఁ జాలమందికి ప్రాణరక్షణము జరిగినట్లును విని సంతసించితిని.

దల్కానియాలో మఱియొక వారము దినము లుంటిని. సోమవార మింటికిఁ బోవుదు నని శనివారమునాఁడు వారికిఁ దెలియఁబఱచితిని. ఈ పులి రాజ్యములో రమారమి యొక మాస ముంటిని.

చుట్టును రక్షణలేని డేరాలో నిద్రచేఁ గలిగిన బడలికవలనను, అదియే తుది యడు గను భావముతో నంతులేకుండ దినమంతయు నడచుటవలనను నరములు దుర్బలములు కాఁజొచ్చెను. నా నిర్ణయమును మార్పు చేయించుటకై గ్రామీణులు యత్నించి ప్రథమావకాశ మున నేను మరలి వత్తు నని వాగ్దానము చేసిన పిమ్మట నే సంతృప్తిఁ జెందిరి.

దల్హౌసియాకు వచ్చునపుడు నే ననుసరించిన మార్గమున బహుశ్రమమీఁద నెక్కవలసిన గుట్ట లెన్నియో యుండెను. హైరాఖాన్ ద్వారా మరలి పొమ్మని గ్రామీణులు నాకు సలహా యిచ్చిరి. ఈ మార్గమునఁ బోయి గ్రామముపై కనుమ చేరుట కొకే యెగుడు త్రోవ కలదు; అచ్చటినుండి రాణీబాగ్ వరకును ఒక దిగుడుత్రోవ కలదు. అక్కడనుండి నైనితాలుకు కారులోఁ బ్రయాణము ముగింపవచ్చును. పెందలకడ నిద్రలేచి సన్నద్ధులు కండని పరివారజనులకు జెప్పి, సూర్యోదయాత్పూర్వమే నేను బయలుదేరి, సామానులు సర్దుకొని న న్ననుసరింపుఁ డని పలికి, దల్హౌసియాలోని నా మిత్రులకడ వీడ్కోలు పొంది, కనుమపై నటవీమార్గమును జేరుటకై రెండుమైళ్ల యెగుడు త్రోవఁ బట్టితిని.

ఆ మార్గము లోఁతైన గనుమలగుండా, సిందూర దేవదారు వనములలో నుండి, దట్టమైన తుప్పలతో నిండి మెలికలు తిరిగియుండెను. వారము దినములు పులి వృత్తాంత మేమియు తెలియ రాలేదు. వార్త తెలియక

పోవుటచే నేను మఱింత జాగరూకుఁడ నైతిని. మకాము నుండి బయలుదేరిన గంటకే దుర్ఘటన లేకుండ కొండ శిఖరముకడ విశాలమైన యనావృత ప్రదేశము చేరితిని. అయ్యది వనమార్గమునకు నూఱు గజముల దూరమున నుండెను.

ఆ మైదానము బేరీపండు నాకారముతో నించుమించుగా నూఱుగజముల పొడవు, ఏబదిగజముల వెడల్పున నుండెను. దానినడుమ వర్షపునీరు నిలిచిన గుంట కలదు. కణుఁజు మొదలగు జంతువు లీ గుంటలోని నీరు త్రాగుచుండును. దీనిచుట్టు జంతువుల యడుగుల జాడలు గమనింపఁ గుతూహలము కలిగెను. నేను మడుగును సమీపించి, నీటికడ నున్న మెత్తని నేలపై పులియొక్క పదచిహ్నములు కనుఁగొంటిని. నేను వచ్చిన దిశనుండియే యదియును మడుగును సమీపించి నా రాకవలనఁ గలఁతఁ జెంది పల్వలమును దాఁటి, మైదానమునకు కుడిప్రక్కన వృక్షములతో నిండిన చిట్టడవిలోనికిఁ జొచ్చెను. నాకు మంచియవకాశము లేకుండఁ బోయినది.

పులి నన్నుఁ జూచియుండనిచోఁ మడుగునుదాఁటి త్వరితముగా నిభృతస్థానమునకుఁ జేరియుండెడిది కాదు. నన్నుఁ జూచి, నే నేకాకి నని గ్రహించి, చాటున దాగి యుండి నాపై దృష్టి యుంచి, తనవలెనే నేనుగూడ గుంటకుఁ బోయి జలపానము చేయుదునని భావించియుండును. ఇంతవఱకును నా చలనాదికము స్వాభావికముగానే యుండెను. తా నచ్చట నున్నట్లు నేను గ్రహింపలేదని దాని నపోహలోనే

నుంచఁగలిగినచో బహుశః పులి నాకు రెండవసారి యవకాశ మిచ్చును. క్రిందికి వంగి, నా టోపీ యడుగుభాగమునుండి జాగరూకతతో దృష్టి సారించుచు, పెక్కుసార్లు దగ్గుచు, జల మిటు నటు వెదఁజల్లి, నిదానముగాఁ గదలుచు, మార్గమున నెండుకట్టెలు ప్రోగుచేయుచు, నేటవాలుగా నున్న పాషాణపాదమును జేరితిని. అచ్చటఁ జిన్న మంటవేసి పాషాణము నానుకొని, సిగరెట్ ముట్టించితిని. అది పూర్తి యగుసరికి నిప్పు చల్లాఱెను. అంతట నేను నేలపై వామ హస్తము దిండుగా నిడుకొని, రైఫిల్ క్రింద నుంచి గుబ్బపు బిసపై వ్రేలుంచితిని.

నా కెగువగా నున్న శిల మిక్కిలి యేటవాలుగా నుండుటచే దానిపై జంతు వేదియు కాలూని నిలువఁజాలదు. కావున నా పురోభాగమునే జాగరూకతతోఁ జూచుచుండ వలెను. నే నున్నచోటికిఁ జిక్కని మాటుప్రదేశ మిరువది గజములలో లేకుండుటచే నా యునికి భద్రమయ్యెను. ఇంత తడవును నా కే జంతువు కానరాలేదు, జంతువు సవ్వడియు వినరాలేదు. అయినను పులి పొంచియుండె ననియే నావిశ్వాసము. నాటోపీ యంచు కన్నుల కడ్డముగా నున్నను దృష్టికిమాత్ర మడ్డముగా లేదు. నా కనుచూపుమేరలో నున్న యడవిని ప్రతిభాగము బరిశీలించి చూచితిని. గాలి యేమాత్రము వీచుటలేదు, పర్ణము కాని తృణము కాని కదలుటలేదు. నా పరిచారకులు గంటన్నరవఱకును రారు. ఈసమయమున పులి చాటువీడి, నక్కి నాపైఁ బడుట కెక్కువ యవకాశ మున్నది.

కాలము గడవని సమయములు కొన్నియు, కాలము రెక్కలు కట్టుకొనిపోవు సమయములు కొన్నియు నుండును. నేను శిరస్సు వాల్చిన వామహస్తము చాలతడవు క్రిందటనే మొద్దుపాఱెను. క్రింది లోయలోని జనుల గేయము త్వరలోనే వినవచ్చెను. అంతకంతకుఁ గంఠధ్వనులు స్పష్టతరము లయ్యెను. తీక్ష్ణమైన మలుపు తిరిగి వారు దృగ్గోచరు లయిరి. పులి నీరు త్రాగిన పిమ్మట నన్నీవంపులోనే జూచియుండును. మరల నాశాభంగమై యీ ప్రయాణములోఁ దుది యవకాశముకూడఁ బోయినది.

నా పరివారజనము కొంచెము విశ్రమించిన పిమ్మట యెగుడుబాట నిరువదిమైళ్ల దూరపు హైరాఖాన్ ప్రయాణము మొదలిడితిమి. మేము రమారమి రెండుమైళ్లు పోవుసరికి దున్నలగుంపును మేపుచు నొకఁడు త్రోవలోఁ గూరుచుండి యుండెను. మే మల్పాహారము భుజించుటకై యాగవలసి యుండెను. మాకు నీ రెక్కడ దొరకునని వాని నడిగితిని. మార్గము వెంటఁ గొలఁదిదూరము పోయినపిదప మంచినీళ్లబుగ్గ యున్నదని వాఁడు తెలిపెను.

లోహాలీలో స్త్రీ నిహత యైనపిమ్మట పులి వార్త తెలియలేదు. కావున నది యిప్పుడు బహుదూరమున నుండు నని వాఁడు తలఁచెను; వాని పొరబాటు సద్దుబాటు చేసితిని. గుంటకడఁ గ్రొత్తగాఁ గానవచ్చిన పులి యడుగుల జాడలనుగూర్చి చెప్పి దున్నలను గుమిగూర్చి నిజగ్రామమునకు మరలుమని నొక్కి చెప్పితిని. అతనిదున్నలు పదియు నిదానముగ త్రోవకెక్కుచుండెను. తాను గూడ

చున్న తావువరకు నవి గడ్డిమేసినపిమ్మట బయలుదేఱుదు నని యతఁడు చెప్పెను. వానికి సిగరెట్ నిచ్చి, తుది హెచ్చరిక చేసి నేను గదలితిని. కొన్నిమాసముల తరువాత నే నా మండలమునకు రెండవతూరి చన్నప్పుడు వాని యనంతరగాథ నా కా గ్రామీణులు చెప్పిరి.

ఆనాఁడు తుదకు వాఁ డింటికిఁ జేరినపిమ్మట గ్రామస్థులకుఁ జెప్పిన కథ యిది. నే నా మార్గమున మలుపు తిరిగిపోవు వఱకును జూచి, నే నిచ్చిన సిగరెట్ ముట్టించినాఁడు. గాలి వీచుటచే నగ్గిపుల్ల యాఱకుండుటకై వాఁడు ముందరికి వంగినాఁడు. అప్పుడు వాని కుడిభుజమును బట్టుకొని వెనుకకు లాగినట్లయ్యెను. అప్పుడే తన్ను విడిచినవారినిగూర్చి వాఁడు తలఁచుకొన్నాఁడఁట, కాని దురదృష్టవశమున వాని యార్తనాదము మాకు వినఁబడలేదు. సహాయముమాత్రము సమీపములోనే యుండెను. వానియాక్రందనమును, బెబ్బులి గుఱ్ఱును వినఁగానే మహిషములు మార్గముమీఁదికిఁ బరుగెత్తుకొనివచ్చి, పులినిఁ బాఱఁద్రోలినవి. కాని భుజము, హస్తము విరిగిపోయినవి. తన్ను రక్షించిన దున్నలలో నొకదానిపైకి శ్రమపడి యెక్కి తక్కినదున్నలు తన్ననుసరించుచుండగా వాఁ డింటికిఁ జేరెను. గ్రామీణులు తమకుఁ జేతనైనట్లుగా గాయములకు గట్లు కట్టి, ముప్పది మైళ్లదూరములోనున్న హల్ద్వానీ యాసుపత్రికి నాగకుండఁ గొనిపోయిరి. కాని చేరిన కొద్దిసేపటికే వాఁడు మృతి నొందెను.

మానవ నివాసమునకు నూఱు గజముల దూరములో నెల రోజులపాటు డేరాలో నుంటిని. ప్రభాతము నుండి సందెచీకటి వరకును విపినములలో విచరించువాఁడను. బహుపర్యాయములు స్త్రీవేషము ధరించి యాప్రాంతము వారెవ్వరును ధైర్యము చేసి పోవని ప్రదేశములలో గడ్డి కోయుచుండువాఁడను. ఈ సమయములలో పులి నన్ను సంహరించు తరుణము లెన్నిసారులో కోలుపోయియుండును. తుది యత్నముచేసి, పులి దైవవశమున నా దీనుని గాంచి బలిగొనెను.

V

# రెండు తుపాకి ప్రేటులు

మఱుసటి ఫిబ్రవరి మాసములో దల్కానియాకు మరల వచ్చితిని. నేను గత వేసవి కాలమున వెడలిపోయినప్పటి నుండి నేఁటివఱకును జను లనేకులు నిహతులయిరి. పులి జాడలు తెలియలేదు. అట్టిచో నే నెక్కడ నున్న నొక్కటే యని నాకు సుపరిచితమైన ప్రదేశమున మకాముచేయ నిశ్చయించితిని.

నేను వచ్చిన మఱునాఁడు దున్నల నడవిలోఁ గట్టి వేయుట కారంభించితిని. పులి వానిని బలి గొను నను నాస లేకపోయినప్పటికి నటులే చేయుచుంటిని.

నంధార్ లోయ కడుగున నయిదుమైళ్ళదూరములో రమారమి వేయియడుగుల యెత్తుగల నిట్రాతి గుట్టకడ నొక చిన్నగ్రామ మిఱుకుకొని యున్నది. కడచిన కొలఁది మాసములలో పులి యీ గ్రామ పరిసరములలో నలువురు జనులను హత మొనర్చినది. నేను మఱునాఁ డుదయము పెందలకడనే బయలువెడలి, గ్రామమున కెదురుగా నున్న కొండ యెక్కి నా ఫీల్డుగ్లాసెస్‌తోఁ గళ్లయద్దములతో గంటకుపైగా గుట్టను బరిశీలించితిని. అనంతరము లోయ దాఁటి, లోఁతయిన లోయగుండా, గ్రామమున కెగువ నున్న గుట్టపై కెక్కితిని. అచటి దుర్ఘట గమనము నా

కేమాత్రము రుచింపదయ్యెను. జాతి పడినచో మెడ విఱుగు టయే కాక, పులి న న్నాక్రమించినచో స్వప్రాణరక్షణము గూడ నసాధ్యమగును.

మధ్యాహ్నము రెండుగంటలకు నిట్టూతిగుట్టను తనివితీరఁ జూచి లోయకుఁ బైగా నామకాములో ప్రాతఃకాలభోజనము నకై పోవుచు, వెనుదిరిగిచూడఁగా నేనప్పుడేవచ్చిన దిశనుండి యిరువురు నావైపు పరుగెత్తుకొని వచ్చుచుండిరి. ఆ నాఁడు నేను ముందుగా దాఁటివచ్చిన లోఁతైన లోయలో వృషభ మును వ్యాఘ్ర మప్పుడే చంపినట్లు చెప్పిరి. నా మకాము చేరి, నా కాహారమును, తేనీటిని బంపుమని నా నౌకరుతోఁ జెప్పు మని యొకనితోనని, రెండవవాఁడు న న్ననుసరించుచుండ లోయక్రిందికి మరలిపోతిని.

వృషభము నిహతమైన లోయ రమారమి రెండు వందల యడుగుల లోఁతు, నూ ఱడుగుల వెడలుపు కలది. మేము సమీపించుచున్న కొలఁది రామబందులు పైకెగసినవి. చచ్చిన జంతువును దరియఁగా రాబందులు జంతు చర్మ మును, బొమికలను మాత్రము విడిచిపోయినట్లు కానఁ బడినది. అంతట మేము గ్రామమునకుఁ జని చిన్న దున్నను, కొద్ది పొడవుగల గట్టి పలుపు నిమ్మని గ్రామణి నడిగితిమి.

నేను లోయకు మరలివచ్చునప్పటికి సూర్యుఁ డస్తమింప నుండెను. బలిసిన దున్నను బట్టుకొని కొందఱు నా వెంట వచ్చిరి. వృషభము హతమైన ప్రదేశమున కేఁబది గజము లలోఁ బైనుండి కొట్టుకొని వచ్చిన దేవదారు వృక్షముకొన యిసుక పడకలో పాతుకొనిపోయి, కొద్దిగాఁ గానఁబడు

చుండెను. కానఁబడుచున్న యా భాగమునకు మహిషమును గట్టివేసి వారు గ్రామమునకు మరలి పోయిరి. అచట వృక్షములు లేవు. నేను గూర్చుండుట కనువైన ప్రదేశము చిన్న తిప్ప. అది గ్రామమువైపున కుండెను. అధిక కష్టమున నేనీ తిప్పపై కెక్కితిని. అది రెండడుగుల వెడలుపు, నయిదడుగుల పొడవు; లోయ పడకనుండి యిరువదియడుగుల యెత్తు, తిప్పకుఁ గొంచెము క్రిందిభాగమున రాయి లోనికిఁ దిరిగినది. కావున కానఁబడని లోఁతైన గూడుగా నేర్పడినది. పులివచ్చునని భావించిన దిశకు వెనుదిరిగి కూరుచుంటిని. ముప్పదిగజముల దూరములో నా కెడమ వైపున కొంచెము ముందరికి దున్న యున్నది.

సూర్యుఁ డస్తమించెను. క్రిందఁ బండుకొనియున్న మహిషము కాళ్ళమీఁద లేచి, 'లోయ' కెదురుగా నిలిచెను. అంతలో రాయి యొకటి జాఱుచు క్రిందికి దొరలెను. ధ్వని యుప్పతిల్లిన దిక్కునకుఁ దుపాకి పేల్చుటకై నా కవకాశము లేక, నిశ్చలముగా గూర్చుంటిని. కొంతతడవునకు మహిషము క్రమక్రమముగా వామభాగమునకు మరలుచుఁదుదకు నావైపు తిరిగినది. అది భయపడినట్లు కానవచ్చినది. మహిషము దేనివలన భయపడినది నాకుఁ గ్రిందుగా నున్న భాగమును జూచియే యని స్పష్టమాయెను. ఇంతలో సూటిగా నాకుఁ గ్రిందుగా వ్యాఘ్రముతల కానవచ్చెను. ఆ స్థితిలో దానికి తుపాకిగుండు తగులుట వట్టిది. ఇంచుమించు రెండు నిముసములసేపా శిరస్సు కదలకుండనుండెను. అనంతరము శార్దూల మొక్క పరుగున ముందరికి

దుమికి దున్నపైఁబడెను. తన కెదురుగానున్న దున్న కొమ్ములపోటు తప్పించుకొనుటకై ప్రక్కనుండి బెబ్బులి దానిపైఁ బడెను. పోరాటము జరుగలేదు. రెండు స్థూల దేహముల యభిఘాతము తప్ప నన్య ధ్వని లేదు. మహిషము సడి చప్పుడు లేక పడిపోయినది. పులి కొంతవరకు దానిపై నుండి గొంతు పట్టుకొని యున్నది. వ్యాఘ్రము జంతువు మెడపై గట్టిదెబ్బ కొట్టి చంపునని సామాన్యముగాఁ దలంతురు. అది సరికాదు. పులి తన కోరలతోనే జంతువును సంహరించును.

పులి కుడిభాగము నావైపు తిరిగియుండెను. సరిగా గుఱిచూచి తుపాకి ప్రేల్చితిని. చప్పుడు చేయకుండ వ్యాఘ్రము మరలి కనుమమీఁది కెగిరి కంటికిఁ గానఁబడకుండఁ



పారిపోయెను. గుఱి తప్పెననుట స్పష్టము. దానికి హేతువు తోఁపలేదు. నన్నుఁ గాని, రైఫిల్ వెలుతురుకాని చూడని

పక్షములో శార్దూలము మరలి వచ్చుట కవకాశ మున్నది. కావున రైఫిలులో తోటాలు తొడిగి కూరుచుంటిని.

దున్న కదలిక లేక పడియుండుటచే పులికిఁ దగులక మహిషమునకు తుపాకిగుండు తగిలెనని గట్టిగా నమ్మితిని. పది పదునైదు నిముసములుకూడ దాఁటిపోయినవి. నాకుఁ గ్రిందుగా రెండవసారి పులితల కనఁబడెను. కొంతతడవు గడచెను. పులి నిదానముగా దున్నకడకు నడచిపోయి, దానిని వీక్షించుచు నిలఁబడియుండెను. దాని వీఁపంతయు గుఱియై యుండఁగా రెండవసారి నేను బొరఁబడుట కవకాశము లేదు. గుఱి చూచి, బిస నిదానముగా నొక్కితిని. నే నాశించినట్లు పులి చచ్చిపడుటకు మాఱుగా వామపార్శ్వమునకు దుమికి, ప్రక్కనున్న చిన్న లోయవెంట పైకిఁ బరుగిడెను. ఏటవాలుగానున్న కొండరాలు దొరలిపడినవి.

# VI

## రెండద్భుతములు

సాధ్యమగునంతవఱకు మంచి వెలుఁతురులో ముప్పదిగజముల నుండి రెండుసారులు ప్రేల్చిన తుపాకి మ్రోఁత యాతురముగానున్న జనులకు మైళ్లకొలఁదిదూరము వినఁబడినది. మృతమహిష శరీరమున నొక గుండుదెబ్బ గుఱుతు నిశ్చయముగాను, బహుశః రెండవగుండుదెబ్బ రంధ్రముకూడను నేను వారికిఁ జూపఁగలిగినవి. నిజముగా నాదృష్టితీక్ష్ణత తగ్గియుండవలెను; లేకున్న కొండరాతిమీఁది కెక్కినపుడు తుపాకిమీఁది ‘ఈగ’ (foresight) ప్రక్కకు తొలఁగియుండవలెను. చిన్నవస్తువులమీఁదికి నాదృష్టినిఁ గేంద్రీకరించి, లోపము లేదని తెలిసికొంటిని. బ్యారల్ వెంట (తుపాకిగొట్టము) చూడఁగా గురులు సరిగా నున్నట్లు తోఁచినది. కావున రెండుసార్లు గుఱితప్పుటకుఁ గారణము తుపాకిప్రేల్చు నేర్పులో లోపమని యెంచితిని.

మూఁడవసారి పులి వచ్చుట కవకాశము లేదు; వచ్చినను నిష్ప్రయోజనము. మంచివెలుతురున్నప్పుడు దానిని జంపలేని నేను వెలుఁతురు లేనపుడు చంపుట వట్టిది. ఈస్థితిలో నేను తిప్పమీఁద నుండుట నిరర్థకము.

పగటివేళ నేను పడినశ్రమవలన నావస్త్రము లింకను తేమతో నుండెను. శీతలతరముఁ గానున్న శీతల వాయువు

వీచుచుండెను. నా (పొట్టి షరాయి) పలుచని ఖాకీగుడ్డతోఁ జేసినవి. శిల కఠినముగా శీతలముగా నుండెను. గ్రామమున నాకొఱకు వేఁడి తేనీరు సిద్ధముగా నుండెను. ఈ హేతువులు బాగుగా నున్నను నే నున్న చోటనే యుండుటకు మంచికారణము పులికొఱకే. అప్పటికి బాగుగాఁ జీకటి పడినది. నాకును గ్రామమునకును నడుమ గండశిలలు పడియున్న లోయలో చిక్కని తుప్పలున్నవి. పావుగంట నడచినచో నచటికిఁ జేరుదును. పులి యేవైపున నున్నదో స్పష్టముగాఁ దెలియదు. ఆ క్షణములో బెబ్బులి యేఁబదిమైళ్లదూరములో నుండ వచ్చును; ఏఁబదిగజములదూరములో నైన నుండి నాపై దృష్టి యుంచవచ్చును. సౌకర్యము లేకున్నను చోటు కదలకుండుట యుచితమని తోఁచినది. గంటలు విసువుతో గడచుచున్నకొలఁదిని పులులను రాత్రివేళ వేఁటాడుట వేఁడుక యని నా కనిపించలేదు. ఈ జంతువు పగటివేళ నిహతము కానిచో నాకు సంబంధించినంతవర కీశార్దూలము వార్ధకమువలన మరణింపవలసినదే. చలిచే కొయ్యవాఱి, తుపాకి ప్రేల్చుటకుఁ దగినంత వెలుతురు వచ్చినంతనే హిమంచులోఁ దడిసిన పాషాణముపైనుండి నేను క్రిందికి దిగజాఱునపు డీభావము దృఢతరమయ్యెను. నాకుఁగాని రైఫిలుకుఁగాని యాఘాత మేమియు లేకుండనే యదృష్ట వశమున నిసుక పడుకమీఁదికి జాఱితిని.

అది ప్రత్యూష మైనను గ్రామములో కదలిక పుట్టెను. నేను త్వరలోనే చిన్న జనసమూహములోనికిఁ జేరితిని.

ఆతురముగా వా రడిగిన ప్రశ్నములకు ప్రత్యుత్తరముగా నాపులిపై వట్టితోటాలు ప్రేల్చుచుంటినని చెప్పఁగలిగితిని.

తేనీటిపాత్రయు, మండెడి నిప్పులును పైచలిని లోచలిని దొలఁగించినవి. చాలమంది జనులును గ్రామములోని బాలకు లందఱును వెంట రాఁగా నేను రాత్రి గడపిన గండశిల కడకుఁ బోయితిని. క్రిందిభాగమున పులి యెట్లు కానఁబడెనో, మహిషముమీఁది కెట్లు లంఘించెనో, నేను తుపాకి ప్రేల్చిన పిమ్మట నా దిశ కెట్లు పులి పరుగిడెనో వివరించితిని. నే నా లోయవైపు చూపునప్పటికి 'అదిగో పులి చచ్చి పడి యున్నది' అని వారు ఉద్రేకముతో నఱచిరి. రేయి యంతయు మేల్కొని యుండుటచే నా కన్నులు పొడి యాఱినవి. అయినను ముందరికి వెనుకకుఁ జూచిన తర్వాత చచ్చిన పులి యచట లేదనుటకు వీలులేకపోయెను. ఇరువది ముప్పది నిముసముల తరువాత నేను తుపాకిని మరల నేల ప్రేల్చితినను సహజప్రశ్నమునకు సమాధానముగా పులి సరిగా నచటనే రెండవమాఱు కానఁబడెనని చెప్పితిని. అది మహిషమువద్ద నిలుచుండి యుండఁగా తుపాకి ప్రేల్చితిని; అనంతర మది కురమ కవతలవైపుగా లంఘించె నంటిని. 'అదిగో, ఇంకొకపులి చచ్చి పడియున్నది' అని మరల కేకలు వినఁబడెను. వ్యాఘ్రములు రెండు నించుమించు సరిసమానముగా నున్నవి. నేను తుపాకి ప్రేల్చినచోటికిఁ బులు లరువదిగజముల దూరములోఁ బడియున్నవి.

ఏటవాలుగా నున్న గండశిలాముఖమునకుఁ గ్రిందుగా నేను కూరుచున్న చోటికి రమారమి రెండువందల గజముల

క్రిందిభాగమునఁ గనుమలోనికి మార్గము కానఁబడెను. గ్రామవాసు లందఱు న న్ననుసరించుచుండఁగా చచ్చిన దున్న ప్రక్కగా మొదటిపులి పడియున్న తావునకుఁ బోయితిని. నేను సమీపించునప్పటి కది వృద్ధవ్యాఘ్రముగాఁ గానిపించుటచే నా యాశ లుచ్చైఃస్థాయి నందెను; దానిపాదములను పరిశీలించుటకై మోఁకరిల్లితిని. గోధుమపైరు కోయుచున్నవారిని పొంచి పట్టుటకై పులి యత్నించుచున్నపుడు పొలముచివర దాని పాదచిహ్నములు బాగుగా ముద్రితములైనవి. వాని నప్పుడు జాగరూకతతోఁ బరికించితిని. ఆ గుర్తులను బట్టి పులి మిక్కిలి ముసలిదనియు, వార్ధకము తోఁబాటు పాదములు విడిపడి పెద్దవైన వనియు స్పష్టమాయెను. ముందరి పాదముల దిండ్లు లోఁతుగా గాఁటు పడియున్నవి. ఈవలనుండి యావలకు గాఁటు కుడిపాదము క్రింద ఎక్కువ లోఁతుగా నుండెను. నే నదివర కెన్నఁడు నంతటి పొడుగాటి వ్రేళ్లు చూడలేదు. విశిష్టములైన యీ పాదములనుబట్టి నూరు చచ్చిన పులులనుండి యీ పులిని వేర్పఱచుట సులభము. నాయెదుటనున్న జంతువు నరమాంస భక్షిణి కాదని గ్రహించి విచారించితిని.

ఈ స్థితిగతులనుబట్టి రెండవపులి మగదియై యుండును. దానిని దెచ్చుటకై కొందఱను బంపితిని. ప్రక్కనున్న కనుమ యిరుకుగను, ఎగుడుగను ఉండెను. కొంతవడికి వారు కేకలు వేయుచు నవ్వుచు రెండవ వ్యాఘ్రమును [redacted] పులిప్రక్కన పరుండఁ బెట్టిరి.

పదునాలుగు గంటల క్రిందటఁ బ్రాణములు వదలిన పులుల చర్మము నొలుచుట నే నుద్యమించిన పనులలో నెల్ల ప్రతికూలవేదనీయమైనది. ఎండ వీఁపు మాడ్చుచుండెను. అంతకంతకు జనులు చుట్టును గుమిగూడుచుండిరి. మధ్యాహ్నము దాఁటినంతనే పని పూర్తియయ్యెను. ఆ రెండు చర్మములను చక్కఁగా కట్ట కట్టించి మోసికొని పోవుటకై నా పరివారమున కప్పగించి, అయిదుమైళ్ల దూరమున నున్న నా మకామునకు మరలిపోవ సంసిద్ధుఁడ నయితిని.

ప్రాతఃకాలమున సమీపగ్రామములవారును గ్రామణియు వచ్చిరి. నేను వెడలిపోవుటకుఁ బూర్వము చౌగర్ పులి మృతినొందలేదనియు, వారేమాత్ర మప్రమత్తులుగా నున్నను పులికి మంచి యవకాశ మొసఁగినవారగుదు రనియు హెచ్చరిక చేసితిని. నా హెచ్చరికను వారు పాటించినచో పులి తరువాత మాసములలో నందఱను జంపియుండెడిది కాదు.

అనంతర మా పులిజాడ తెలియరాలేదు. నేను దల్కానియాలోఁ గొన్ని వారములుండి, 'తరాయి' నుండి ఆహ్వానము వచ్చుటచే నచ్చటికి వెడలిపోతిని.

# VII

# పులిని వెదకుట

1930 మార్చి నెలలో మా జిల్లా కమీషనరు వివియన్ దొర మానవభక్షిణి సీమలో సంచారము చేయుచు వెంటనే వెడలి రమ్మని 22 తారీఖున నాకు వార్త నంపెను. తాను కాలా-అగర్‌లో నాకై యెదురుచూచుచుందునన్నాఁడు. నైనీతాల్ కాలా-అగరుకు రమారమి యేఁబది మైళ్ల దూరము. వివియన్ వ్రాసిన జాబు చేరిన రెండుదినములకు నేను కాలా-అగర్ ఫారెస్టు బంగాళా చేరితిని. సరిగా అల్పాహార సమయమునకు వివియన్ దంపతులను సమీపించితిని. 21 తేదీ సాయంసమయమునకుఁ దాము బంగాళా చేరితిమనియును, వరాండాలో తాము తేనీరు పుచ్చుకొనుచుండగా బంగాళాయావరణలో గడ్డికోయుచున్న యాఱుగురు స్త్రీలలో నొకతెను మానవభక్షిణి సంహరించి కొనిపోయెననియును, అప్పుడు వివియన్ దంపతులు చెప్పిరి. జంతువు నీడ్చిన జాడనుబట్టి వివియన్ చని, యొకానొక సిందూరవృక్షపాదమునఁ బొదలో స్త్రీకళేబరమును గనుఁగొనెను. తరువాత నేను నేలను బరికించిన పిమ్మట వివియన్ యనుచరులు సమీపించుచుండఁగా పులి కొండ దిగి పోయి, శవమున కేబదిగజములదూరములో నుసిరిక పొదలలో దాఁగుకొనెను. వివియన్ కొంటకు సిందూర

వృక్షమున మంచె వేసిరి. కళేబరమున కెగువగాఁ బోవు నటవీమార్గమున రెండు చెట్లమీఁద నతని సహచరులకు మంచెలు నిర్మించిరి. అవి సిద్ధమయినంతనే వారు వానిపై కెక్కి కూరుచుండిరి. రాత్రి యంతయు మేల్కొని వేచి యున్నను వారికిఁ బులిజాడయైనను గోచరింపలేదు.

మఱునాఁ డుదయము స్త్రీశవమును దహనార్థము కొని పోయిరి. బంగాళాకు నరమైలుదూరములోఁ గట్టివేసిన మహిషమును పులి యా రేయియే సంహరించెను. మఱునాఁటి సాయంకాల మా మహిషకళేబరముకడ వృక్షముపై వారు కూర్చుండిరి. ఇంకను వెన్నెల రాలేదు. కనుచీఁకటి గ్రమ్మి వస్తువు లస్పష్టము లగుచుండెను. అప్పుడు తొలుత వారికి ధ్వని వినవచ్చెను. అనంతర మా కళేబరము కడ కేదో జంతువు వచ్చుచున్నట్లు కానఁబడెను. ఆ మందాంధకారములో వారు దానిని భల్లూకమని భ్రమించిరి. దురదృష్టవశమున నా భ్రాంతి కలుగనిచో విలియన్ దంపతులు మంచి గుఱికలవా రగుటచే రైఫిల్ ప్రేల్చి పులిని సంహరించి యుందురు.

25 తేదీన విలియనులు కాలా-అగర్ విడిచి పెట్టిరి. ఆ రోజున దల్కొనియానుండి నా నాలుగు మహిషములు వచ్చినవి. పులి యీ విధమైన బలి నంగీకరించుట కున్ముఖముగా నుండుటచే దున్నల నటవీ మార్గమునఁ గొన్ని వందల గజములలో దూరదూరముగాఁ గట్టి వేసితిని. వానిని ముట్టుకొనకుండ పులి మూఁడు రాత్రులు వరుసగాఁ జనుచుండెను; కాని నాల్గవ రాత్రి బంగాళాకు సమీప

ములో నున్న దున్న చంపఁబడెను. ఉదయమున దాని కళేబరమును పరీక్షింపఁగా బంగాళా కెగువను గత రాత్రి బొబ్బరించిన రెండు చిఱుతపులులు దానిని జంపి నట్లు తోఁచినది. అంతట హతాశుఁడ నైతిని. పులి భయ పడి పాఱిపోవునను శంకచే నీప్రాంతమునఁ దుపాకి ప్రేల్చుట కిచ్చగింపనైతిని. అయినను నేను చిఱుతపులులను హత మార్పనిచో నవి మిగిలిన మూఁడు దున్నలను వధించుట నిశ్చయము. మహిషకళేబరమున కెగువగా నవి చలిదీర్చు కొనుచు గండ శిలలమీఁద నుండగా పొంచి పోయి వానిని సంహరించితిని.

కాలా-అగర్ బంగాళానుండి యటవీమార్గము చాల మైళ్ళవరకును సూటిగా పశ్చిమముగా నందమైన దేవదారు, సిందూర, గులాబీవనముల గుండఁ బోవును.

తరువాత పదునాలుగు దినములపాటు పగటివేళ దానిపై నేను దప్ప నన్యు లెవ్వరు నడుగు పెట్టని యటవీ మార్గమునఁ గాని యడవిలోఁగాని గడపుచుంటిని. ఆ రోజులలో రెండు సారులు మాత్రము పులిని సమీపించితిని. మానవభక్షిణియగు పులిచేసిన నాశమువలన గతవత్సరము జనులు విడిచిన కాలా-అగర్ గట్టును, దక్షిణముఖముననున్న యేకాంత గ్రామ మును జూచుటకుఁ బోయితిని. మరలి వచ్చునపుడు పశువుల పుంత ననుసరించితిని. అది గట్టుమీఁదుగాఁ బోయి క్రిందుగా వడవిమార్గమును జేరును. నేను రాలగుట్టను సమీపించు నప్పటి కెదుట నపాయము వాటిల్లునని తటాలునఁ దోఁచెను.

నే నీ మార్గమునఁ జాలసారులు నడచితిని. కాని రాతి గుట్టల ప్రక్కగాఁ బోవుటకు సందేహించుట కిదియే మొదలు. రాలను తప్పించుకొని పోవలెనన్న చిట్టడవిగుండఁ గొన్ని వందల గజములు నడవవలెను; లేకున్న నెగువగా బహుదూరము చుట్టు తిరిగి పోవలెను. మొదటి త్రోవ మిక్కిలి యపాయకరమైనది. రెండవమార్గమునఁ బోవుటకు చాలినంత కాలము లేదు. సూర్యుఁ డస్తమింప నున్నను ఇంకను రెండు మైళ్ళదూరము నేను వెళ్ళవలెను. కావున నా కిష్ట మున్నను లేకున్నను రాల కెదురుగాఁ బోవుట తప్పలేదు. నూఱడుగులు నడచినచో నపాయకర ప్రదేశము దాఁటుదును. కావున నడుగులో నడుగు వేసి కొనుచు, శిలల కభిముఖుఁడనై రైఫిల్ భుజమునకుఁ దగి లించుకొని ప్రక్కవాటముగా నడచుచుంటిని. చూచువా రున్నచో నా ప్రయాణమున కచ్చెరు వొందుదురు.

రాలగుట్ట కావల ముప్పది గజములలో వనమార్గము కలదు. అది యేఁబది యఱువది గజములవఱకును కొండపైకి వ్యాపించియున్నది. దీనికిని శిలలకును నడుమ పొద లడ్డుగా నున్నవి. ఈ మార్గమున నొక కకర్ (అఱచెడి జింక) గడ్డి మేయుచుండెను. అది నన్నుఁ జూడకపూర్వము దానిని నేను క్రీఁగంటఁ జూచితిని. నన్నుఁ జూచినంతనే యది తల పై కెత్తి, నిశ్చలముగా నుండెను. నేను దానివైపు చూడ కుండ నిదానముగాఁ జనుచుంటిని. తమ్ము నితరులు చూడలే దను భావము కలిగినప్పు డీ జంతువు లిట్లే చేయుచుందును. తరువాత నేను వంపుచేరి, వెనుదిరిగి నా భుజము మీఁదుగా

దానిని బరికించితిని. కకర్ తలవంచుకొని మరల గడ్డి మేయు చుండెను.

వంపు తిరిగిన పిమ్మట నేను కొలఁది దూరము నడచు నప్పటికి యాకకర్ భయభ్రాంతయై యఱచుచు కొండమీఁదికి పారిపోయెను. శీఘ్రముగాఁ గొన్ని యంగలు వేయుచు నేను మలపునకు మరలి వచ్చునప్పటికి నడుగు భాగమున బొదలలోఁ గదలిక చూడఁగలిగితిని. కకర్ పులిని చూచె ననుట స్పష్టము. దానిని జూడఁగలిగినదొక్క త్రోవలోనే. నా కంటఁబడిన గదలిక పక్షిపాఱుటవలనఁ గావచ్చును; లేక పులివలననైనను గావచ్చును, ఎట్లయినను ముందుకు జనుటకు మున్ను కొంత పరిశోధన చేయుట యవసర మనిపించెను.

రాలక్రింది నుండి చిన్న నీటియూఁటవలన నెట్టమట్టి త్రోవ తేమగా నుండెను. ఈ తడినేలపై నడచినపుడు నా పాద ముద్రలు పడినవి. వానిపై వెడల్పుకల పులియడుగు జాడలు కానవచ్చినవి. రాలపైనుండి పులి దుమికి నన్ననుసరించి నప్పుడా ముద్రలు పడినవి. కకర్ పులిని జూచి బెదరి యఱచినప్పుడా పులి మార్గము విడిచి పొదలలోఁ బ్రవేశించెను. నేను గమనించిన కదలిక యదియే. పులి కా ప్రదేశమంతయుఁ బరిచితమై యుండవలెను. శిలలకడ నన్ను సంహరించుటకువీలు లేకయు, తొలి సన్న మల పులో వధించు నవకాశమును కకర్ చేఁ బోగొట్టఁబడుట చేతను చిక్కనితెప్పలవెంట నడచుచు దగ్గర మలపులో నన్నడ్డగించుటకైఁ బులి యత్నించుచుండనోపును.

ఆ త్రోవవెంట ముందరి కరుగుట యుచితము కాదని తోఁచి, శాద్వలముమీఁదికి కకర్ పోయిన సరణిని జని, ఎడమప్రక్కకు మరలి, క్రిందికి నిదానముగాఁ జనుచు, అనావృతప్రదేశముగుండఁ గ్రింది వనమార్గమును జేరితిని. తగినంత వెలుతురున్నచో నా సాయంకాలము పులి పని



పట్టించెడివాఁడనే. అది యీవలకు వచ్చినప్పుటి స్థితిగతు లన్నియు నాకే యనుకూలముగా నుండెను. దానికి బరిచిత ప్రదేశము నాకును పరిచితమే. నా భావము దానికిఁ దెలి యుట కవకాశము లేకున్నను దాని చింత నాకుఁ దెలియును. అయినను, చీకటిపడనుండుటచే నవకాశము వినియోగించు కొనఁ జాలనైతిని.

ఈ యదనున పులి చప్పుడు వినఁబడలేదు, నేను పులిని జూడలేదు. పక్షివలనఁగాని జంతువువలనఁ గాని దాని స్థితి

నాకు సూచితము కాలేదు. అయినను రాలలో నాకై పులి వేచియుండు నని నిస్సంశయముగా స్ఫురించినది. ఆ నాఁడు గంటలకొలఁది సంచరించుచు మైళ్ళకొలఁది ప్రయాణము యలసటలేక జాగరూకతతోఁ జేసితిని. అపుడు క్షణమాత్ర మయినను నాతురత కలుగలేదు. కాని కట్టమీఁదికిఁ జేరి, శిలల కభిముఖుఁడ నైనంతనే యచట నపాయము కలదని యాకస్మికముగాఁ దోఁచెను. ఈ విషయము యథార్థమేయని యావల కొన్ని నిముసములకు ధ్రువ మయ్యెను. ఆటవిక జీవులకు కకర్ చేసిన మొఱవలనను, మానవభక్షిణి పాదముద్రలు నాపదచిహ్నములపైఁ బడియుండుటనే కను గొనుటవలనను, 'యథార్థమేయని ధృవపడెను.

VIII

# మరియొక యద్భుతము

నా కథనము నింతవఱ కోపికతో ననుసరించిన పాఠకులకు మానవభక్షిణితో నాకుఁ దొలి సమాగమమునుగూర్చి వివరింపఁదలఁచినాను. ఆతొలిభేటీయే తుదిదికూడ నయ్యెను.

1930, ఏప్రిల్ మాసమున, 11 తారీఖున, మధ్యాహ్నమున - నేను కాలా - అగర్ చేరిన 19 రోజుల తరువాత - నీ కలయిక సంభవించినది.

అటవీ మార్గములో నక్కడక్కడ నా మూఁడు దున్నలను కట్టివేయు సంకల్పముతో నా నాఁడు మధ్యాహ్నము రెండు గంటలకు బయలువెడలితిని. బంగాళానుండి మైలు దూరములో వంట చెఱకు ప్రోగుచేయుచున్న జనసంఘమును గలిసికొంటిని. వారిలో నొక వృద్ధుఁడు మేము నిలిచియున్న చోటికి రమారమి యయిదువందల గజముల దూరమునఁ గొండక్రిందుగానున్న సిందూరవృక్షముల గుంపును జూపి, పదునెనిమిది వత్సరముల వయసుకల తన యేకైకపుత్రుని పులి యక్కడనే సంహరించెనని చెప్పెను. అతని కుమారుఁడు చనిపోయిన చోటికి సమీపములో దున్నను కట్టివేయుదునని యతని ప్రీతికై చెప్పితిని. ఆ యువకుఁడు మృతినొందిన సిందూర కుంజమున కానుకొని నివృత ప్రదేశమునకు దగ్గ

ఱగా కాలిదారి యుండెను. రమారమి ముప్పది చదరపు గజముల యీ భూ ఖండముమీఁద నొక్కటే దేవదారు వృక్ష పోతకము కలదు. దానిని నఱికి మ్రానుకు మహిష మును గట్టివేసితిని. దానికి గడ్డి కోసి వేయుట కొకనిని నియోగించి మాధోసింగు అను రెండవవానిని చెట్టెక్కు మనియు, తన గొడ్డలితో నెండు కొమ్మలు కొట్టుచు బిగ్గరగా నఱచుచుండుమనియు స్పష్టముగాఁ జెప్పితిని. తమ పశువుల కాకులు కోయునపుడు కొండజాతివా రట్లు చేయు చుందురు. నివృతప్రదేశమునకుఁ గ్రింది యంచుమీఁద నించు మించుగా నాలుగడుగులయెత్తున నొకపాషాణముపై నిలిచి తిని. రాతిబండ కావలగా క్రిందిలోయవైపునకు కొండ నిటారుగా నొరగియున్నది. దానిపై చెట్లు, తుప్పలు దట్టముగాఁ గప్పఁబడియున్నవి.

తాను కోసిన గడ్డిని చాలసారులు నేలపై నున్నవాఁడు తీసికొనిపోయెను. చెట్టుపై నున్న మాధోసిం గొకసారి కేకలు వేయుచు, మరొకసారి గట్టిగా పాట పాడు చుండెను. నేను రాతిపై నిలిచి సిగరెట్ కాల్చుచుంటిని. పులి వచ్చినట్లు నాకు స్ఫురించెను. మాధోసింగును నా కభిముఖుని జేసికొనుటకై నీలవేసి, శాంతముగా నుండు మని సంకేతము చేసితిని. భూమి మూఁడుప్రక్కల నించు మించుగా వనావృతము. చెట్టుమీఁది మాధోసింగు నా వామభాగమునను, గడ్డికోయువాఁడు నా కెదురుగను, నాతురత సూచించుచు మహిషము నా కుడివైపున నెదురు గానుండెను. నా కంటఁబడకుండ పులి యీ ప్రదేశమును

సమీపింపలేదు. సమీపించినపు డది నా వెనుక దిక్కున, సూటిగా క్రిందుగా నుండును.

నేను నిలిచియున్న రాతి కావలి భాగము నిటారుగా, నునుపుగా నుండెననియుఁ, గొండదిగువకు నెనిమిది పదియడుగులదాఁక వ్యాపించెననియు, దాని క్రింది భాగమును జిక్కని తుప్ప లావరించెననియు గమనించితిని. రాతిమీఁదికిఁ బులి యెక్కుట కష్టమే కాని సాధ్యమే. ఆ ప్రయత్నము చేసినచోఁ దుప్పలలో దానిసవ్వడి వినఁబడుటమీఁదనే నాకు రక్షణ యున్నదని నమ్మియుంటిని.

మాధోసింగు చేయు ధ్వనికి పులి యాకర్షింపఁబడి రాతి కడకు వచ్చి నావైపు చూచుచు ముందుకర్తవ్య మాలోచించునపు డది వచ్చియున్నట్లు నేను గ్రహించితి నని నమ్మకము. నా కదలికవలనను, పరిజనుల మౌనమువలనను పులికి సంశయము కలిగియుండును. ఏమయినను గొలఁది నిముసముల తరువాత కొండకు దిగువభాగమున నించుక దూరమున నెండు కొమ్మ విఱిగిన చప్పుడయ్యెను. అనంతర మాతురత తొలఁగి మనసులోని భారము సడలెను. తరుణము దాఁటిపోయినది. అయినను, తుపాకి పేల్చుట కింకను సదవకాశము లేకపోలేదు. పులి మరలివచ్చుట నిస్సంశయము; వచ్చి, మే మందఱము వెడలిపోయిన పిదప మహిషమును వధించి తృప్తి చెందవచ్చును. ఇంకను నాలుగైదుగంటల కాలము వెలుతురుండును. లోయదాఁటి, యెదురుగానున్న యెగుడు నెక్కినచో మహిషమును కట్టివేసిన ప్రాంతము బాగుగాఁ గానఁబడును. నేను 'బారు' చేసి కొట్టగలిగినచో

దూరము రెండుమూఁడువందలగజము లుండును. అయినను, నేను పట్టుకొనియున్న రైఫిల్ గుఱిని సూటిగా కొట్టఁగలది.

పరివార ముండుట సంకట మయ్యెను. వారిని బంగాళాకు నిస్సహాయముగాఁ బంపుట హత్యతో సమాన మగును. గత్యంతరము లేక వారిని నాయొద్దనే యుండనిచ్చితిని.

పులి యెత్తుకొని పోవుటకు వీలులేకుండునట్లు మహిష మును మోఁదునకుఁ గట్టివేసి, అనావృత ప్రదేశమును విడిచి, మార్గమును జేరితిని. ఇదివరలో యోచించిన క్లొదురు కొండపైనుండి పులిపై తుపాకీ పేల్చవలెనని నాయూహ.

త్రోవవెంట రమారమి వందగజములు చను నప్పటికి కనుమ తగిలినది. దీని కావలితట్టున త్రోవ చాల చిక్కని తుప్పలలోనికిఁ బ్రవేశించును. ఇరువు రనుచరులతో దట్ట మైన గుబురులలోనికిఁ జొచ్చుట సమంజసము కాదు. కావునఁ గురమను ప్రవేశించి, తుప్పల కావలిమార్గమును జేరుటకు నిర్ణయించితిని.

కురమ పదిగజముల వెడలుపు, నాలుగై దడుగులలోఁతు. నే నందులో కాలు పెట్టు నప్పటికి 'ఆసకప్పెరగాఁడు' అను పిట్ట రాతిపైనుండి యెగిరిపోయెను. పిట్ట లేచిన చోటు చూడఁగా రెండు గ్రుడ్లు కానవచ్చినవి. ఎండు గడ్డి రం గుతో, చిక్కని గోధుమవన్నె చారలతో నాయండము లసామాన్యాకారములో నున్నవి. ఒకటి పొడవుగా కొన తేలి యున్నది; రెండవది గోలికాయవలె గుండ్రముగా నున్నగా నున్నది. నా సేకరణలో 'ఆసకప్పెరగాని' గ్రుడ్లు లేకపోవుటచే వీనిని జేర్చుటకు నిర్ణయించితిని. వీనిని

గొనిపోవుట కుపకరణములే లేనందున నాయెడమ యర చేయి దొన్నెవలెఁ జేసి, వాని నందులోనుంచి, తీఁగనాఁచు వాని చుట్టు చుట్టితిని.



లోయ క్రిందికి నేను జనునప్పటికి దాని గోడ లెత్తై నలువదిగజముల దూరమున పంద్రెండు పదునాలు గడుగుల పాటుప్రదేశమునకు వచ్చితిని. వర్షాకాలమున నీకొండ కురమ లలోనుండి ప్రవహించు జలమువలన శిలలు గాజువలె నునుపు తేలినవి. కాలు పెట్టి నిలుచుట కనువుకాని నిట్టనిడుపుగా నుండుటచే రైఫిల్ పరిజనుల కిచ్చి, యంచుపైఁ గూరుచుండి క్రిందికి జాఱఁజొచ్చితిని. నా పాదము లిసుకపడుకను తాఁకెనో లేదో పరిజనులు నా కిటు నటు క్రిందికి దుమికిరి. వారు రైఫిల్ నా చేతిలోఁ బెట్టి పులిసవ్వడి వింటిరా యని కలవర పాటుతో నడిగిరి. నిజముగా నా కేమియు వినఁబడలేదు. రాతి మీఁద నా వస్త్రముల రాపిడివలన వినఁబడకుండవచ్చును. సమీపముగా నేవైపునుండియో వారికి దీర్ఘముగా గుఱ్ఱు వినఁబడినదఁట. సరిగా నెటనుండియో వారికిఁ దెలియదు.

మేము ముప్వురము గుదిగుంపుగా నిలుచున్న తావునకు మా వెనుక నున్నని నిట్టనిలువు రాయి యుండెను. మా కుడి

వైపున పదునైదడుగుల యెత్తున, కనుమ మీఁదికి కొలఁదిగా వ్రాలిన రాతిగోడయు, వామభాగమున ముప్పది నలువది యడుగుల యెత్తున రాలకట్టయుఁ గలవు. మేము నిలిచి యున్న యిసుకపడుక రమారమి నలువది యడుగుల పొడవునను, పదియడుగుల వెడల్పునను నున్నది. దీని క్రింది కొనలో దేవదారు వృక్షము పడి, ఆనకట్టవలె నుండెను. దీనివలననే యిసుక పేరుకొన్నది. వృక్షమునకు పండ్రెండు పదునైదడుగులలో పైభాగమున రాతిగోడ ముగిసినది. ఇసుకమీఁద కాలిచప్పుడు కాకుండ రాతి చివరకు మేము వచ్చునప్పటికి యదృష్టవశమున రాతి వెనుకఁగూడ నిసుక పడుక వ్యాపించియున్నట్లు కనుగొంటిని.

ఇంతగా వివరించి నేను చెప్పిన గండ్రశిల పెద్ద వ్రాఁతి పలకవలె నున్నదని చెప్పవచ్చును. దాని క్రింది యంచు రెండడుగుల మందము. అది కేవలము నిటారుగా నిలవక గొంచె మొక పొడుగు ప్రక్కకు వంగినది.

ఈ పెద్ద పలక కావలఁ జేరి నేను కుడిభుజము మీఁదుగా వెనుకకుఁ జూచునప్పటికి వ్యాఘ్రముఖము సూటిగాఁ గానఁబడెను.

IX

# అదృష్టము నా వైపు

రాతి వెనుక నిసుకపడుక కేవలము చదునుగా నున్నది. దానికి కుడి ప్రక్కన కొద్దిగా వెలుపల కొరగిన పదునైదడుగుల యెత్తు పలకరాయి కలదు. దాని కెడమ ప్రక్కన రమారమి పదునైదడుగుల యెత్తున నేటవాలుగా తట మున్నది. దానిమీఁద దట్టమైన ముండ్లపొదలు చిక్కుకొనియున్నవి. నే నిదివరలో దిగివచ్చిన జాఱుడుకన్న కొంచె మెత్తైన జాఱుడు తట్టతుద నున్నది. ఈ సహజకుడ్యములు మూఁడిటికిని నడుమనున్న యిసుక పడుక రమారమి యిరువది యడుగుల పొడవు, అందులో సగము వెడల్పు. ముంగాళ్ళ పంజాలు తెఱచుకొని వెనుక కాళ్ళు పొట్టక్రిందికి కూడఁదీసికొని పులి పండుకొని యుండెను. పంజాలకు కొంచెము మీఁదుగా పై కెత్తుకొని యున్న దానితల నా కెనిమిది యడుగుల దూరమున నుండెను. ఈ సంగతి తర్వాత కొలతవలనఁ దెలిసినది. బహుకాలమునకు మరలి వచ్చిన యజమానుని జూచి స్వాగతమునకు సిద్ధముగా నున్న శునకము ముఖముమీఁది మందహాసమువంటి దరహాసము దాని మొగమునఁ గానవచ్చెను.

ఆక్షణమున రెండు భావములు నామనస్సున తళుక్కుమన్నవి. ఒకటి : ముందు నేనే కదలవలెను; రెండు :

ఆ కదలికవలన పులికి బెదరు కాని, కంపముకాని కలుగ రాదు.

నా ఛాతీకై మూలలుగా కుడిచేతిలో రైఫిల్ ఉన్నది. సేఫ్టీక్యాచ్ విడుదల చేసితిని. పులి ముఖముమీఁదికి తుపాకి మూతి 'బారు' చేయవలె నన్న ముప్పాతిక వలయము త్రిప్పవలెను.

ఒంటిచేతితో రైఫిలును త్రిప్పుట ప్రారంభమయి నాలు గవభాగ మగునప్పటికి 'గుఱ్ఱము' నా కుడిప్రక్కకు తగిలెను. ఇఁక చేయి చాఁపక తప్పదు. 'గుఱ్ఱము' నా డొక్కను దాఁటిపోవునట్లు నెమ్మదిగా రైఫిలును త్రిప్పుచుంటిని. అప్పటికి చేయి పూర్తిగా చాఁపితిని. తుపాకి బరువెక్కుచుండెను. మూతి యింక కొంచెము తిరుగవలెను. ఇంతతడవును నాపై దృష్టి నిలిపియున్న పులి యట్లే చూచుచుండెను. దాని ముఖ మున సంతృప్తి సూచకమగు దరహాసము కానవచ్చు చుండెను.

రైఫిల్ ముప్పాతిక చక్రభ్రమణము చేయుట కెంత తడవు పట్టెనో చెప్పెడిస్థితిలో లేను. పులి కన్నులలోనికిఁ జూచు చున్న నేను బ్యారల్ కదలిక గమనింపలేకుంటిని. చేయి చచ్చుపడినట్లు తోఁచినది. భ్రమణము సంపూర్తి కా దని పించినది. అయినను మదకు భ్రమణము సంపూర్ణమై తుపాకి పులిశరీరమునకు 'బారు' కాఁగానే ట్రిగ్గర్ నొక్కితిని.

ఆవృతప్రదేశమున నత్యధిక ధ్వని వినఁబడెను. త్రుళ్లి తాఁకు గ్రహించితిని. తుపాకి సరిగా ప్రేలినట్లే నిదర్శనములు లేకున్న చో క్లిష్టసమయములో తుపాకులు సరిగా ప్రేలుట

కంగీకరింపక నెదురుతిరుగుననునొక భీకర స్వప్నములో నుండెడివాఁడను.

క్షణకాలము పులి కదలక మెదలక యుండెను. తెఱచుకొనియున్న పాదములమీఁదికి దానితల నిదానముగా నొఱగెను. తోటా దెబ్బ తగిలిన రంధ్రమునుండి రక్తస్రావము తోడనే బయలువెడలెను.

కొలఁదిగజముల దూరములో నన్ననుసరించుచున్న యిరువురకును పులికిని నడుమ నొక పాషాణముండెను. నేను నిలిచి వెనుదిరిగి చూచునప్పటికి వారాగిపోయిరి. నేను బులిని జూచితినని వారు పసికట్టి, నా వాలకమునుబట్టి యది సమీపములో నున్నట్లు నిశ్చయించిరి. చేతిలోని పక్షి గ్రుడ్లు జాఱవిడిచి రైఫుల్ మీఁదికి రెండుచేతులు పోనిండని కేకవేయఁదలఁచితినని మాధోసింగు నాతో తరువాతఁ జెప్పినాఁడు. నేను రైఫుల్ ప్రేల్చి క్రిందికి దింపినపుడు మాధోసింగు ముందఱకి వచ్చి నా చేతిలోని తుపాకీ తీసికొన్నాఁడు. ఆకస్మికముగా నా కాళ్లు చచ్చుపడినట్లయినవి. పతితవృక్షము వైపునకు తోడనే చని కూరుచుంటిని. పులిపాదములక్రింది దిండ్లు చూడక పూర్వమే నే నీ యానందమయమగు వేఁటభూమికి బంపిన చౌగర్ పులి యిదియేయని నాకుఁ దెలియును.

నాకు ప్రతికూలముగా నున్నట్లు కనఁబడు మూఁడు విషయములును నిజముగా నాకనుకూలములే. (1) వామహస్తములోని పక్షిగ్రుడ్లు, (2) నేను పట్టుకొనియున్న తేలిక రైఫుల్, (3) పులి నరమాంసభక్షణ కలవడినది. అండములు

హస్తములో లేకున్న చో రెండుచేతులును రైఫుల్ మీఁదికి వేసి యుందును. అంతటి సామీప్యమున పులిని గాంచినపుడు దాని కభిముఖుఁడ నగుటకై నప్రయత్నముగా తిరుగ యత్నించి యుందును. నా త్వరితచలనమువలన పులి యెగిరి నాపై దుమికెడిదే. రైఫుల్ తేలికది కానిచోఁ జేయి పూర్తిగా జాఁపి ప్రేల్చియుందును. అది మానవభక్షిణి కాక సామాన్య పుండరీక మగుచో నాక్రమితమగునపుడు నివృతప్రదేశము నకుఁ బరుగిడును. అపుడు నన్నది తుడుచుకొని పోవునదే. పులి రాపిడి తగిలినచో పరిణామము సామాన్యముగా నపాయకరము.

పరిజనులు చని దున్నను విడిపించి త్రాడు తీసికొను చుండగా నేను పాషాణముపై కెక్కి, కనుమమీఁదికిఁ జని గ్రుడ్లను యథాస్థానమునఁ జేర్చితిని. ఇంతవఱకును యీ అండ ములు నాచేతిలోనే యుండి యథాస్థానమునఁ జేర్చునప్పటికి వెచ్చగనే యుండెను. అర్ధ గంట తరువాత నే నటు పోయి నపుడు చూడగా నవి తల్లిచాటునఁ జేరినవి. పక్షిరంగు రాతిరంగులోఁ గలిసిపోయినది. గూఁడెచట నున్నదో స్పష్టముగాఁ దెలిసిన నాకు త త్ప్రాంతములనుండి పక్షిని గుర్తించుట కష్టమాయెను.

పులిని బంగాళాకు మోసికొని పోవుటకై మరలి వచ్చి మాధోసింగు సాయ మపేక్షించితిని. అతఁ డీపని కేమాత్ర మున్ముఖుఁడు కాలేదు. మేము తలపెట్టినపని దుర్భర మైనది. అయినను సూర్యకాంతి యున్నది. జుట్లు చెదరిపోయినను మేము సంతోషముతో కాలా-అగర్ ఫారెస్టు బంగాళాకు

పులిని మోసికొని పోతిమి. మహిషము మ మ్మనుసరించు చుండెను. అయిదుసంవత్సరములపాటు చౌగర్ పులి ప్రాభవము నెఱపిన వందలకొలఁది చదరపుమైళ్ల కొండలోయలలో నాఁటిసాయంకాలమునుండి నేఁటివఱకును మానవు లెవరును నిహతులు కాలేదు; ఎవరికిని గాయము తగులలేదు.

ఈ బెబ్బులి సంపాదించుకొన్న చిహ్నమును, తారీఖును నా కెదురుగా గోడపై వ్రేలాడుచున్న తూర్పు కుమావన్ పటమునఁ జేర్చినాను. కాలా-అగరుకు రెండు మైళ్ళు పశ్చిమముగా చిహ్నము లిఖించితిని. దాని క్రింద వేసిన తేదీ – ఏప్రిల్ 11, 1930.

# ప్రశ్నలు

1. ఈ కథాసంఘటనకు ఉనికిపట్టయిన పరిసరములను సామాన్యముగ వర్ణింపుము.
2. వేటలో నిపుణుఁడైన జిం కార్బెట్ నందుగల విశేషలక్షణములను వర్ణింపుడు.
3. పులులు నరమాంసమున కలవడుటకు గారణమేమి?
4. దల్కానియాలో పులిబారినబడి క్షతగాత్రయైన బాలికగా నీవు భావించి సంఘటననుగురించి వ్రాయుము.
5. 'కూఁయ్' అను పద్ధతిలో వార్తాసౌకర్యము లెట్లు జరుగునో ఒక పేరా వ్రాయుము.
6. జిం కార్బెట్ ఆకస్మికముగ రెండు పులుల నెట్లు వధించెనో సంక్షిప్తముగ వర్ణింపుడు.
7. వేటకు ముందుగా వేటకాండ్రు చేసికొను నేర్పాటులేవి?
8. వేటకాని జీవితములో గల కష్టములనుగూర్చి ఒక పేరా వ్రాయుము.
9. ఒక పేరాలో పులులెట్లు తమ యాహారమునకై జంతువధచేసి, మాంసమును పంచుకొనునో వ్రాయుడు.
10. నరమాంసభక్షిణులైన పులుల ప్రత్యేకలక్షణములు, జీవితపరిస్థితులనుగురించి ఈ కథలో నీవేమి నేర్చుకొంటివి?
11. అత్యంతోపద్రవదాయకమగు చౌగర్ పులి యెట్లు చంపఁబడెనో క్లుప్తముగ వ్రాయుడు.
12. కుమాన్ప్రాంతజనుల సామాన్యస్థితిగతులనుగూర్చి ఒకపేరాలో వ్రాయుము.

